# ఆంధ్రపత్రిక

THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 43. సంచిక 14 FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 15-4-1956 Reg. No. M. 5745. 10 పేజీలు 2 అణాలు




3/9 286

# కాశ్మీరులో యుద్ధవిరమణ హద్దే భారత పాక్ సరిహద్దు

## సైనికకూటాలు 'జనవాక్యం' అసాధ్యం చేశాయని నెహ్రూ స్పష్టీకరణ

### ఆయుధాల తగ్గింపు సమస్య

#### చర్చలు ఎలా జరపాలని ఆలోచన

లండన్, ఏప్రిల్ 13: ఆర్టే ఫలితం లేకుండా 4 వారాలనుంచీ ఇక్కడ జరుగుతున్న అయిదు అగ్రరాజ్యాల సంప్రదింపుల్లో ఇకముందు సోవియట్ ప్రతినిధితో విడిగా చర్చ జరపాలి అన్న విషయమై నాలుగు పశ్చిమ రాజ్యాల ప్రతినిధులు సంప్రదింపులు జరిపారు. అయిదు రాజ్యాల ఉపసంఘం రెండు వారాల్లో సమితి ఆయుధాల తగ్గింపు సంఘానికి నివేదిక సమర్పించవలసి వున్నది.

జర్మనీ విభజన ఉన్నంత వరకూ రష్యాతో ఆయుధాల తగ్గింపు ఒప్పందం చేసుకోవద్దని పశ్చిమ జర్మనీ విదేశాంగమంత్రి డా॥ హైన్రిక్ ఫాన్ బెంట్రానొ నేడు పశ్చిమ రాజ్యాలకు హెచ్చరిక చేశారు. బాన్‌లో విలేఖరులతో మాట్లాడుతూ ఆయన ఈ సూచన చేశారు.

### పాకిస్తాన్‌లో అస్థిమిత పరిస్థితులు ప్రమాదకరమైనవని హెచ్చరిక

#### భారతీయులు నిగ్రహం చూపడం అత్యావసరం: ఆసియా సమస్యలు సైనికచర్యలతో పరిష్కారం కావు

న్యూఢిల్లీ, ఏప్రిల్ 13: అమెరికా ఆయుధ సహాయం, మనిలా, బాగ్దాదు సైనికకూటాలు — ఈ కూట సైనిక తంత్రాంగాలవల్లనే కాశ్మీరులో జనవాక్యసేకరణ సంకల్పం, సన్నాహం, సమాలోచనలు పునాదితో సహా ధ్వంసమైపోయినాయని ప్రధాని శ్రీ నెహ్రూ ఢిల్లీ కాంగ్రెస్ ఏర్పాటు చేసిన పెద్దబహిరంగసభలో ప్రసంగిస్తూ చెప్పారు.

ప్రస్తుతపు యుద్ధవిరమణ హద్దునే సరిహద్దుగా అంగీకరించి సరిహద్దురేఖను నిర్ధేశించి, పరిస్థితులలో స్థిమితంకలుగచెయ్యాలని భారతప్రభుత్వం పాకిస్తాన్ నాయకులకు పరిష్కార మార్గంగా సూచించారని శ్రీ నెహ్రూ తెలియచేశారు.

తూర్పు పాకిస్తాన్‌నుంచి వేలాదిగా హిందువులు భారతదేశానికి పారిపోయి రావడానికీ, కాశ్మీరు సమస్యపై పాకిస్తాన్‌లో ఆగ్రహావేశాలకూ సంబంధం ఉందని చెప్తూ, కాశ్మీరులో ఇప్పుడు జనవాక్యసేకరణ జరిగే పక్షంలో తిరిగి 1947 లో మాదిరే మతకల్లోలం చెలరేగగలదని శ్రీ నెహ్రూ హెచ్చరించారు.

అనేక వేలమంది ప్రజలు వచ్చిన ఈ బహిరంగ సభలో శ్రీ నెహ్రూ కాశ్మీరు సమస్య విషయంలో భారతదేశం ఎల్లప్పుడూ ఔచిత్యం, నిగ్రహం సభ్యత పాటిస్తూనే ఉందనీ, భారతదేశం అనుసరిస్తున్న విధానంలో కాశ్మీర్ ప్రజలకు భారతీయులకే కాక పాకిస్తాన్ ప్రజలపట్ల కూడా న్యాయాన్నే దృష్టిలో పెట్టుకుందని ప్రకటించారు. కాశ్మీరుపట్ల భారతదేశ విధానం ఋజువైనది, సరళమైనది అన్నారు. ఈ మాటలకు అక్కడ చేరిన వేలాది ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

శ్రీ నెహ్రూ గంటన్నరపైగా చేసిన ప్రసంగంలో చాలవరకు కాశ్మీరు సమస్యకే వినియోగించారు.

#### కాశ్మీర్‌లో పాకిస్తానీల జులుం

శ్రీ నెహ్రూ ఇలా చెప్పారు: "నేను పాకిస్తానీ నాయకులకు ఈ విధంగా విసమర్చి చెప్పాను: 'కాశ్మీరులో మీరు చాలా అత్యాచారాలు చేశారు చాలా జులుం చలాయించారు. మీరు తిష్ఠవేసుకు కూర్చున్న కాశ్మీరు ప్రాంతంలో ఉండడానికి మీకెంత మాత్రం హక్కు లేదు. కాని మనదేశాల మధ్య సంఘర్షణ సంభవించకూడదనీ, అక్కడి పరిస్థితులు తిరిగి అల్లకల్లోలమైపోకూడదనీ నా కోరిక. కాబట్టి ప్రస్తుతం మీ అధీనంలో ఉన్న కాశ్మీరు ప్రాంతానికి పరిహద్దులను యుద్ధవిరమణ హద్దుల ఆధారంతోనే నిర్ణయించి, నిర్దేశించి, స్థిమితంగా స్థిరపడ్డ సమస్యని సరించి మీతో సమాలోచనలు జరపడానికి నేను సిద్ధంగా ఉన్నాను. యుద్ధం చేసి ఆ ప్రాంతాన్ని ఆక్రమించుకోవాలనే కోరిక మాకు లేదు' అని స్పష్టంగా చెప్పాను."

#### జీహాద్ నినాదం

అయితే ఈ మాటలకి పాకిస్తానీ నాయకులేం జవాబిచ్చారో శ్రీ నెహ్రూ తెలియచెయ్యలేదు. కాని ఈ మాటలు స్పష్టంగా చెప్పిన కొన్ని రోజులకు అకస్మాత్తుగా ఒక రోజున పాకిస్తాన్‌లో ఆగ్రహావేశాలు చెలరేగాయి. పాకిస్తానీ పత్రికలు భారత దేశంపై కత్తి దుయ్యాలనీ, జహాద్ లేవదియ్యాలనీ నినాదాలు ప్రారంభించినాయన్నారు.

#### పాకిస్తాన్‌లో అస్థిర పరిస్థితి

ఇటీవల మూడు నాలుగేళ్లుగా పాకిస్తాన్‌లో ప్రభుత్వాలు చాలసార్లు మారి


4 వ పేజీ 3 వ కాలం చూడుడు


### లీగ్‌తో ఖాన్ సాహెబ్ పేచీ

#### రాజీ ఉండదని ప్రకటన

కరాచీ, ఏప్రిల్ 13: పశ్చిమ పాకిస్తాన్ ముఖ్యమంత్రి డా॥ ఖాన్ సాహెబ్ నేడు లాహోరునుంచి వచ్చారు. పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ తనకు రాష్ట్ర శాసనసభలో అధిక సంఖ్యాబలం వున్నదని, తన మంత్రివర్గాన్ని ఇంకా పెంచుతానని చెప్పారు.

"ప్రస్తుతం శాసనసభ్యులు నిజమైన ప్రజాప్రతినిధులు కారు. అందుచేత నేను దీనిని రద్దుచేసి, ఎన్నికలు జరిపించవలసిందిగా గవర్నరును కోరుతానన్నాను. అట్లు జరిపించే హక్కు గవర్నర్‌కు వుంది" అన్నారు.

ఇక్కడికి రాగానే డా॥ ఖాన్ సాహెబ్, అధ్యక్షుడు మీర్జాను, ప్రధానమంత్రి మహమ్మదాలీని కలుసుకున్నారు. తాను ముస్లింలీగుతో ఎటువంటి సంబంధాన్ని పెట్టుకోనని ఆయన ఖచ్చితంగా చెప్పినట్లు తెలుస్తున్నది.

ఈ సమాలోచనలలో ఏదో రాజీ పద్ధతి కుదరనిపక్షంలో పశ్చిమ పాకిస్తాన్ లీగులో చీలికలు తప్పవని అభిజ్ఞులు అంటున్నారు. డా॥ ఖాన్ సాహెబ్ తాను ప్రజలకు నాయకత్వం వహిస్తున్నానని, తన నాయకత్వాన్ని వారు కోరుతున్నారని, దేశంలో ఎన్నికలకోసం వారు తహతహలాడుతున్నారని, ఆ ఎన్నికలు జరిపించడానికి తాను అధికారం వహిస్తున్నానని అంటున్నారు.

"ఒకానూర్ ఖాన్ శాసనసభను రద్దు చేయించే హక్కు, ముఖ్యమంత్రికి లేదని అంటున్నారుగదా?" అని విలేఖరులు ప్రశ్నించగా, 'ఇలాంటి ప్రశ్నలకు ప్రజలు ఈ ఉత్తరం ఇస్తారని ఆయనతో చెప్పండి' అన్నారు.

ప్రధానమంత్రి మహమ్మదాలీ రేపు ట్రిపోలీకు బయలుదేరి పోతున్నారు. అందువల్ల ఆయన వచ్చే దాక పశ్చిమ పాక్ సమస్య ఇట్లు తేలకుండానే వుంటుంది. ఈలోగా ఖాన్ సాహెబ్‌తో చేరిన 8 సభ్యులు ఖుద్రో-దౌలతానాలు దుర్మార్గాలను ప్రచారం చేస్తున్నారు. వీరిద్దరు అధికారాన్ని చేజిక్కించుకోవాలని మా దావని, అది రాకపోయే సరికి ఎదురు తిరిగారని, వీరు అంటున్నారు. ఎన్నికలలో కుట్రలు సాగించడం కోసం ఖుద్రో-దౌలతానాలు అధికారాన్ని వాంఛిస్తున్నట్లు కూడా వీరు చెపుతున్నారు.

డా॥ ఖాన్ సాహెబ్ కరాచీ విమానాశ్రయంలో దిగగానే అఖండ జన సమూహం ఆయనకు స్వాగతం ఇచ్చింది. ఇందులో ముస్లింలీగర్లు కూడా చాలామంది వున్నారు. ఆయన ఇలా అన్నారు. దేశాన్ని పాలించవలసింది ఎవరు అన్న సంగతిని ప్రజలు తేలుస్తారు. నేను ప్రజల కోసం, పాకిస్తాన్ శ్రేయస్సు కోసం పని చేస్తున్నాను. నాకు రాజీలు, పదవి రావు. అవిస్వార్థపరులకు కావాలిగాని నాకు కాదు."

### భారతదేశానికి అమెరికా ఆహార ధాన్యాలు

వాషింగ్టన్, ఏప్రిల్ 13: అమెరికాలు 60 లక్షల డాలర్ల ఆహార ధాన్యాలు కొనుక్కోవడానికి అమెరికా అంతర్జాతీయ సహకార సంఘం భారతదేశానికి అనుమతి ఇచ్చింది. జూలై 31 లోగా ఈ సరుకును రూపాయలతో కొనుక్కోవచ్చు.

### ఆంధ్రలో యురేనియం, థోరియం గనులు

కర్నూలు, ఏప్రిల్ 13: అణుశక్తి ఉత్పత్తికి ఆధారమైన యురేనియం గూడూరు తాలూకా సైదాపూరు వద్ద విడిచేసిన ఒక అభ్రకం గనిలో దొరికింది. నెల్లూరు, కడప, గుంటూరు, కర్నూలు జిల్లాలలో అభ్రకం, సీసం, రాగి గనులలో కూడా యురేనియం దొరుకుతుందని పరిశోధనలు జరుపుతున్నారు.

కళింగపట్నం మొదలు కాకినాడ వరకూ సమృద్ధిగా థోరియంకూడా దొరుకుతుందిట. ఇదికూడా అణుశక్తి ఉత్పత్తికి అవసరమైనదే.

ఆంధ్రదేశంలో అణుశక్తికి అవసరమైనవి సమృద్ధిగా దొరుకుతాయి కాబట్టి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఏడాదినుంచి అణుశక్తి పరిశోధనశాఖ స్థాపించి వృద్ధి పరుస్తున్నారు.

గూడూరు తాలూకా సైదాపూరు వద్ద శంకరమైకా గనిలో అభ్రకం దొరుకుతుందని కిందటి సెప్టెంబరులోనే తెలిసింది. అక్కడ 10% యురేనియం లభించే సమర్‌స్కైట్ ఖనిజం నెలకి టన్ను తియ్యవచ్చుట. (బీహారులో కొన్ని గనుల్లో 80% యురేనియం దొరుకుతుంది.)

శంకరగనిలో తీసిన యురేనియంని కేంద్రప్రభుత్వం కొన్నది.

ఇక్కడ మొత్తం ఎంత దొరుకుతుందో ఇంకా అంచనా వెయ్యలేదు. ఇక్కడ గనుల్ని అణుశక్తి సంఘానికి చెందిన ఒక పరిశోధకుడు పరిశోధించి అంచనా వేస్తున్నారు.

నెల్లూరు, కడప, గుంటూరు, కర్నూలుజిల్లాల్లో తెలిసినరాగి, సీసపు గనుల పక్కనే యురేనియం దొరుకుతుందనే ఉద్దేశంతో శాస్త్రజ్ఞులు రెండేళ్లుగా పరిశోధనలు జరుపుతున్నారు.

ఆంధ్రదేశంలో థోరియం బాగా సమృద్ధిగా లభ్యమౌతుంది. 233 యురేనియంని రియాక్టర్‌లో న్యూట్రాన్లు ప్రయోగించి 233 యురేనియంగా మార్చి అణుశక్తి ఉత్పత్తికి వినియోగించవలసినట్లైతే, థోరియంనికూడా మార్చి ఉపయోగించవచ్చు.

కళింగపట్నంనుంచి కాకినాడ వరకూ సముద్రపు ఒడ్డున మూడైదు అడుగుల లోతులోనే నల్ల ఇసుకలో థోరియం అనేక వేల టన్నులు లభిస్తుందని ఆంధ్ర విశ్వవిద్యాలయ భూగర్భశాస్త్ర పరిశోధకులు అంచనా వేశారు. ఈ నల్లఇసుకలో 2 మొదలు 8% వరకు మోనజైట్ లభిస్తుందిట. (ఈ మోనజైట్‌లోనుంచి థోరియం తీస్తారు) ఇదిగాక కాకినాడకు ఉత్తరాన పెంటకోటవద్ద సముద్రపు ఒడ్డుకి నాలుగుమైళ్ళ దూరంలో 12 నిలువుల లోతున మూడోవంతు మోనజైట్ లభించగల మేటలున్నాయి.

అణుశక్తి సంఘం భూగర్భ పరిశోధనశాఖకోసం ఆంధ్ర విశ్వవిద్యాలయం జియాలజిస్టులకు శిక్షణ ఇస్తోంది. అణుశక్తి సంఘానికి చెందిన ఎనిమిదిమంది ఉద్యోగులకు కిందటి వేసవిలో ఆంధ్ర విశ్వవిద్యాలయం పరిశోధన సదుపాయం చేసింది. కిందటేడు ఈ విశ్వవిద్యాలయంలో అణుశాస్త్ర పరిశోధనాగారం నెలకొల్పింది. ఇందులో గైగర్ కౌంటర్ మొదలైన పరికరాలను ఏర్పాటు చేశారు.

### మధోల్ గుర్మిట్‌కల్ ఫిర్కాల భవిష్యత్తు

#### ఆంధ్రప్రదేశ్‌లో చేర్చాలని విజ్ఞప్తి

[స్వకీయ విలేఖరి]

హైదరాబాదు, ఏప్రిల్ 12: మధోల్, గుర్మిట్‌కల్ ఫిర్కాలను ఆంధ్ర-తెలంగాణాలో చేర్చవలసినదని కోరుతూ ఆ ప్రాంత ప్రజల తరపున ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణారావుకు ఒక విజ్ఞాపనపత్రం సమర్పించారు.

మధోల్ ఫిర్కాలో 83 గ్రామాలు, గుర్మిట్‌కల్ లో 36 గ్రామాలు వున్నవి. మధోల్ ఫిర్కాలో నూటికి 85 మంది, గుర్మిట్‌కల్ ఫిర్కాలో నూటికి 75 మంది తెలుగు మాట్లాడే వారు వున్నారని విజ్ఞాపన పత్రంలో తెలియజేశారు. ఈ రెండు ఫిర్కాలు తెలుగు తాలూకాలైన కొడంగల్లు, తాండూరులకు ఆనుకు వేవున్నవి. వాటిని మైసూరు రాష్ట్రంలో చేర్చినచో ఆ ప్రాంతాల ప్రజలకు భాషా విషయకంగానే కాక ఇతరవిధాలకూడా నానా యిబ్బందులు కలుగగలవు. నూతన మైసూరు రాష్ట్ర రాజధాని వీరికి 400 మైళ్ళ దూరంలో వుంటుందని ఆ పత్రంలో పేర్కొన్నారు.

తమను మైసూరురాష్ట్రంలో 'చేర్చరాదని' అక్కడి ప్రజలు కలవరపడుతున్నారు. అట్లా జరిగితే తమ భవిష్యత్తు అంధకార బంధురంగా వుంటుంది. కాబట్టి తెలుగు ప్రజల న్యాయమైన, సహజమైన కోరికలను మన్నించి వారిని ఆంధ్ర-తెలంగాణాలోనే చేర్పించ శాయశక్తులా కృషి చేయుమని విజ్ఞాపనపత్రం ముఖ్యమంత్రిని అర్థించింది.

### కరీంనగరంలో కళాశాల

#### జులైనుంచీ ప్రారంభం

కరీంనగరం కళాశాలా సంఘం ఉస్మానియా విశ్వవిద్యాలయం విధించిన కొన్ని షరతులను పూర్తిచేయ గలిగినట్లయితే వచ్చే జూలైనుంచి కరీంనగర్‌లో ఒక కళాశాల స్థాపితమై పని ఆరంభం కావచ్చును. కరీంనగరం కళాశాల సంఘం తమ కళాశాలను అనుబంధించుకోవలసినదని ఉస్మానియా విశ్వవిద్యాలయాధికార్లకు దరఖాస్తు పెట్టుకున్నారు.

ఇటీవల ఈ విషయమై శాసనసభలో ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ విద్యామంత్రి శ్రీ గోపాలరావు ఎక్బోటే ఇలా అన్నారు. కళాశాలా సంఘం వారు ఇప్పటి వరకు రూ. 53,000 సేకరించారు; మరో రూ. 50,000 విరాళాలకు వాగ్దానాలు కూడా లభించినవి. తమ కళాశాలను అనుబంధించుకోవలసిందని వీరు విశ్వవిద్యాలయంవారికి దరఖాస్తు పెట్టుకున్నారు; కళాశాలల అనుబంధానికి సంబంధించి విశ్వవిద్యాలయానికి కొన్ని నిబంధనలు కలవు. అవి పూర్తి చేయబడితే 1956-57 విద్యా సంవత్సరంనుంచే కరీమ్‌నగర్‌లో క్రొత్త కళాశాల పని ఆరంభం కావచ్చును అన్నారు. (స్వ. వి.)

# పంచాయతీలలో బహిరంగ ఓటింగ్

## పునరాలోచన ఉండదని మంత్రి స్పష్టీకరణ

గుంటూరు, ఏప్రిల్ 11: "అన్ని విషయాలు సమగ్రంగా ఆలోచించే బహిరంగ వోటింగ్ పద్ధతిలో రెండవ తరగతి పంచాయతీలకు ఎన్నికలు జరిపించాలని ప్రభుత్వం నిర్ణయించారు. కనుక ఇక యీ సంగతి మళ్లీ ఆలోచించేదిలేదు." అని గుంటూరు జిల్లా పంచాయతీ అధ్యక్షుల మహాసభకు అధ్యక్షత వహింమతూ స్థానిక పరిపాలనాశాఖ మంత్రి డాక్టరు ఏ. బి. నాగేశ్వరరావు వివరించారు.

### పంచాయతీలకు సహకార బ్యాంకు

పంచాయతీల ఉపయోగానికి రాష్ట్ర సహకార బ్యాంకును ఏర్పాటుచేసి, ప్రతి పంచాయతీ బోర్డుకు అందులో వాటా ఇచ్చి, బ్యాంకుద్వారా పంచాయతీలకు అప్పు లిచ్చే పద్ధతి బాగుంటుందేమో పరిశీలించమని స్థానిక పరిపాలనాశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ రాఘవరెడ్డి విజ్ఞప్తి చేశారు.

గ్రామ పంచాయతీల ఆదాయాన్ని ఎక్కువ చేయవలసిన అవసరం వివరించుతూ ఆహ్వాన సంఘాధ్యక్షుడు శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య సభికులకు స్వాగతం చెప్పారు. మద్రాసు రాష్ట్రంలో వలె గ్రామ పంచాయతీలు ప్రజలకు చేతనైన సౌకర్యాలు సమగ్రంగా కలిపించడానికి వీలుగా పంచాయతీల పదవీకాలాన్ని 5 సంవత్సరాల వరకు పొడిగించమని కోరారు. పంచాయతీ బోర్డుల కార్య నిర్వహణాధికారుల జీతాలను ఎక్కువ చేయించమని, జిల్లా పంచాయతీ ఆఫీసర్లకు జీప్‌కార్లు సప్లయి చేయించమని కోరారు.

డబ్బు అవసరం లేని పనులను గ్రామాలలోని పెద్దలు ఇతరుల సహకారంతో సమాజ వికాస కార్యక్రమాలు, జాతీయ వికాస కార్యక్రమాల రూపంలో చేయించడానికి కృషి చెయ్యాలని శ్రీ సంజీవరెడ్డి విజ్ఞప్తి చేశారు.

స్థానిక పరిపాలనాశాఖ మంత్రికి సిద్ధబోయిన పంచాయతీ అధ్యక్షుడు శ్రీ ఎస్. నాగయ్య సన్మానపత్రం సమర్పించారు. గవర్నరు శ్రీ త్రివేదీ, ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి పంపించిన సందేశాలను మంగళగిరి డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు శ్రీ హెచ్. సాంబమూర్తి చదివారు.

### ఎన్నికల ఖర్చు

డాక్టరు నాగేశ్వరరావు మాట్లాడుతూ ఇట్లా అన్నారు: బహిరంగ వోటింగ్ పద్ధతిలో ఎన్నిక జరిపితే ఒకొక్క పంచాయతీకి రు 70 ఖర్చవుతే రహస్యవోటింగ్ పద్ధతికి రు 450 అవుతుందని అంచనా. మీవారి డబ్బు ఎన్నికలకని ఇట్లా ఖర్చు చేయడం న్యాయం కాదు. వోటర్లందరూ స్వేచ్ఛగా, నిర్భయంగా వోటు చేయడానికి గల చిక్కు లేమిటో తెలియదు."

"ప్రజాస్వామ్యంలో రెండు పార్టీ లుండడం సహజమే. అంతమాత్రాన తమకు వోటు చేయని వారిపై దౌర్జన్యం చేసే పద్ధతిని ప్రభుత్వం సహించబోదు. అన్ని విషయాలను సమగ్రంగా ఆలోచించిన తరువాతనే రెండవ తరగతి పంచాయతీలకు బహిరంగ వోటింగ్ పద్ధతిలో ఎన్నికలు జరిపించాలని ప్రభుత్వం నిశ్చయించారు."

పంచాయతీలు, రాష్ట్ర ప్రభుత్వం పరస్పర సహకారంతో వ్యవహరించవలసిన అవసరాన్ని వివరించి రెండవ పంచవర్ష ప్రణాళిక పనులను జయప్రదం చేయడానికి కృషిచేయమని పంచాయతీలకు మంత్రి విజ్ఞప్తిచేశారు. సేవాదృష్టితో పనిచేయమని పంచాయతీ సభ్యులు, అధ్యక్షులు, పరిపాలనానిర్వహణాధికారులకు విజ్ఞప్తిచేసి అధికారాలను దుర్వినియోగించేస్తే సహించేది లేదని శ్రీ నాగేశ్వరరావు హెచ్చరించారు.

స్థానిక పరిపాలనాశాఖ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ ఏ. రాఘవరెడ్డి మాట్లాడుతూ ఇట్లా అన్నారు:

"ఇకముందు గ్రామపంచాయతీల వ్యవహారాల్లో స్త్రీలు ఎక్కువగా పాల్గొంటే బాగుంటుందనే. పాత పద్ధతిలో కాక సర్వోదయ పద్ధతిలో ఏకగ్రీవంగా పంచాయతీ ఎన్నికలు జరుపుకోమని అభ్యర్థించుచున్నాను.

ఆ తరువాత ఇటువంటి సభల ప్రయోజనాలను వివరించి ఇకముందు జిల్లా మహాసభల వంటివి పట్టణాలలో కాక గ్రామాలలో జరిపించమని శ్రీ రాఘవరెడ్డి సూచించారు. పంచాయతీ సభ్యులు అధ్యక్షునికి మధ్య సహకారం పెంపొందవలసిన అవసరం వివరించి ఇట్లా అన్నారు: "పంచాయతీలు తమ విధులను క్రమముగా నిర్వర్తిస్తే కార్యనిర్వహణాధికారుల అవసరం ఉండేది. బోర్డు సేవకులుగా పనిచేయమని కార్యనిర్వహణాధికారులకు ఉత్తరువు లిచ్చాం. పంచాయతీ అధ్యక్షుని కంటే కార్యనిర్వహణాధికారికి ఎక్కువ అధికారా లున్నాయా?"

"ద్వితీయ పంచవర్ష ప్రణాళిక అభివృద్ధి పనులను జయప్రదం చేయడానికి గ్రామ పంచాయతీలు శ్రద్ధగా కృషి చేయాలి. ప్రతి గ్రామ పంచాయతీ ఒక భవనాన్ని ఏర్పాటుచేసి గ్రంథాలయం మొదలైన సౌకర్యాలను నెలకొల్పి గ్రామ పెద్దలను తరుచు అక్కడ సమావేశపరిచి వారి సహకారాన్ని సముపార్జించాలి."

"ఏకగ్రీవంగా ఎన్నికలు జరిపించిన పంచాయతీలకు బహుమతులు యివ్వాలని నిర్ణయించాం.

"పంచాయతీల అవసరానికి రాష్ట్ర సహకార బ్యాంకును నెలకొల్పి, పంచాయతీలన్నింటికి అందులో వాటాలిచ్చి, బ్యాంకుద్వారా అప్పులిచ్చే పద్ధతి బాగుంటుందేమో పరిశీలించమని కోరుతున్నాను."

రాష్ట్ర పంచాయతీలసంఘం తీర్మానాలను ప్రభుత్వం నిర్లక్ష్యం చేస్తున్నదని శ్రీ వస్తి సుబ్బారావు విమర్శించారు.

పంచాయతీల కర్తవ్యాలను వివరించుతూ శ్రీ పుట్టంబాక శ్రీరాములు ప్రసంగించారు. గ్రామ పారిశుధ్య సౌకర్యాలను ప్రభుత్వం కూడా నిర్లక్ష్యం చేస్తున్నారని విమర్శించారు.

పంచాయతీలకు పరిపాలనా నిర్వహణాధికారులను నియమించే పద్ధతిని రద్దుచేయాలని మాచర్ల పంచాయతీ అధ్యక్షులు శ్రీ ప్రసన్నాంజనేయులు అన్నారు.

పంచాయతీ అధ్యక్షుల పదవీకాలాన్ని 5 సంవత్సరాలవరకు పొడిగించమని శ్రీ జి. కోటయ్య సూచించారు. శ్రీయుతులు వాసిరెడ్డి వెంకయ్య, ఎస్. నాగిరెడ్డి, ఎమ్. సుబ్బారావుగారలు కూడా ప్రసంగించిన తరువాత శ్రీ వాసిరెడ్డి వెంకటసుబ్బయ్య వందన సమర్పణ చేశారు.

# ఇజ్రేల్ - ఈజిప్టు సరిహద్దులు

## సేనలు వెనక్కు తగ్గాలని సూచన

కైరో, ఏప్రిల్ 13: ఇజ్రేల్-ఈజిప్టు సరిహద్దుల్లో ఉన్న ఉభయ సైన్యాలూ యుద్ధవిరమణ హద్దుకు 5 ఫర్లాంగులు వెనక్కు వెళ్లాలని ఈజిప్టు నేడు సూచించింది. ఇదివరకు రెండున్నర ఫర్లాంగులు మాత్రమే వెనక్కు వెళ్లటానికి ఈజిప్టు సమ్మతించింది. అల్ ఓజా ప్రాంతంలోని నిస్సైనిక మండలంలోనుంచి ఇజ్రేల్ తన సైన్యాలన్నిటినీ-పోలీసు కాపలాకోసమని అదుపులో ఉంచిన సైనికులతో సహా-ఉపసంహరించుకోవాలని కూడా ఈజిప్టు ప్రతిపాదించినట్లు రాజకీయ వర్గాల ద్వారా తెలుస్తున్నది. అయితే అల్ ఓజా దగ్గరి ప్రాంతాలనుంచీ, సినాయ్ ద్వీపకల్పం. సరిహద్దుల పొడుగునా ఉన్న ఈజిప్టు సేనలను తగ్గిస్తేనే తప్ప అల్ ఓజా నిస్సైనిక మండలం నుంచి సేనలను ఉపసంహరించేందుకు తాను అంగీకరించేదిలేదని ఇజ్రేల్ స్పష్టపరిచిందట.

ఆత్మ రక్షణకోసం తప్పితే, ఇతరత్రా యుద్ధచర్యలను జరపకుండా ఉంటామనే హామీని ఇజ్రేల్, ఈజిప్టుల దగ్గరనుంచి సమితి కార్యదర్శి శ్రీ హామర్ షెల్డు సంపాదించ కలిగారు. ఇంక ఉభయ సేనలనూ కుప్పాకి వేలు దూరానికి ఎడంగా ఉంచేందుకు ఆయన ప్రయత్నిస్తున్నారు. ఇందుకోసమే ఉభయసేనలూ 5 ఫర్లాంగులు వెనక్కు తగ్గాలని ఈజిప్టు సూచన చేసింది.

ఈజిప్టు ప్రధాని కర్నల్ నాజర్ శ్రీ హామర్ షెల్డు కార్యక్రమాన్ని శ్రద్ధగా గమనిస్తూ, సరిహద్దు సేనానులతో సంప్రదిస్తూ ఉన్నారు. పాలస్తీనా పరిశీలక దళాధిపతి మేజర్ జనరల్ బర్నస్ ఈజిప్టు సైన్యాధికారి కర్నల్ సాలాజోహార్‌తో సంప్రదిస్తున్నారు.

నిస్సైనిక మండలంనుంచి ఇజ్రేల్ సేనలు ఉపసంహరించు నెట్లు శ్రీ హామర్ షెల్డ్ చేయగలిగితే, పరిహద్దుల్లో మళ్లీ తీగల కంచె వేసేందుకు ఈజిప్టు అంగీకరిస్తుందని తెలుస్తున్నది.

ఇక్కడ శ్రీ హామర్ షెల్డ్ సాగిస్తున్న కృషినిగురించి తెలుసుకుపేందుకు భద్రతామండలి రోమ్‌లోకానీ, జెనీవాలోకానీ సమావేశం కాగలదని తెలుస్తున్నది.

ఇజ్రేల్-జోర్డాన్ సరిహద్దుల్లో ఇజ్రేల్ గస్తీదళం జోర్డాన్ పరిహద్దు స్థావరంతో నేటి ఉదయం కొంతసేపు పోరాటం జరిపినదని ఇజ్రేల్ సైనికోద్యోగి ఒకరు నేడు జెరూసలెంలో వెల్లడించారు. జెరూసలెం నగరంలో కొత్త భాగం ఇజ్రేల్ చేతుల్లోనూ, పాత పూరు జోర్డాన్ చేతుల్లోనూ ఉన్నది.

1955-56 లో దేశం మొత్తం మీద గోధుమ, బార్లీ ధాన్యాలను 3 కోట్ల 60 లక్షల ఎకరాలలో పండించారు. 1954-55 సంవత్సరములో కంటె ఈ పంటలక్రింద అదనంగా 25 లక్షల ఎకరాలభూమి సాగులోకి వచ్చింది. అంటే గత సంవత్సరంకంటె ఈ ఏడు సేద్యమైన భూమి 72/5% ఎక్కువన్నమాట. ఇది 1955 డిసెంబరువరకూ వేసిన అంచనా. ఈ అదనపు సాగు బీహారు, పంజాబు, రాజస్థాన్, మధ్యభారత్, మధ్యప్రదేశ్, ఉత్తర ప్రదేశ్ మొదలయిన అన్ని రాష్ట్రాలలోనూ సాగింది.

కేంద్ర ప్రభుత్వ వ్యవసాయ ఆహారశాఖ ఆర్థిక గణాంక సేకరణ వ్యవస్థ ప్రకటించిన తాజా వివరాల ప్రకారం దేశం మొత్తంమీద 1955-56 సంవత్సరానికి 7,62,53,000 ఎకరాలలో వరిపైరు వేశారు; పండిన పంట: 2,54,74,000 టన్నులు. గత ఏడాదికంటె సాగు విస్తీర్ణం 8,04,000 ఎకరాలు ఎక్కువ; అంటే, 2/5% ఎక్కువన్నమాట: 9,43,000 టన్నుల అదనపు ధాన్యం పండింది. నిరుటికంటే 3 4/5% ఎక్కువ!

మధ్యప్రదేశ్, పశ్చిమ బెంగాలు రాష్ట్రాలలో తప్ప పైర్లు బక్కగానే ఫలించినవి. ఈ రెండు రాష్ట్రాలలో సకాలంలో వర్షాలు లేని కారణంచేతా, చీడలు తగిలిన కారణంచేతా పంటలు కొంతవరకు దెబ్బతిన్నవి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఆహారధాన్యాలను ఒక కోటిటన్నులు అదనంగా పండించాలని నిర్దేశించారు. 1955-56 లో పండించిన ధాన్యాల కంటె 15% అదనంగా పండించాలి. ఇందుకోసం పసగణాభివృద్ధిపట్లా, సాంకేతిక విధానాలను వర్తింప జేయగం పట్లా ప్రత్యేక శ్రద్ధవహించడం జరుగుతున్నది.

ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కంటె ద్వితీయ ప్రణాళికలో వ్యవసాయాభివృద్ధికి ఎక్కువ మొత్తాన్ని కేటాయించడం జరిగింది. భూమి విసేద్యం చేస్తున్న విధానాలను, ఫలసాయ భూవసతి వివరాలను, పంటల ధరల భోగట్టాలను సవిస్తరంగా సేకరిస్తేనే గాని దేశంలో వ్యవసాయాభివృద్ధికి అనుకూలమైన పథకాన్ని తయారు చేసుకోడానికి వీలుండదు. ఏ రంగంలో ఏ లక్ష్యాలను సాధించాలన్నా ముందు నిర్దిష్టమైన పథక నిరూపణం చేసుకోవాలి.

వ్యవసాయపరిశోధనా పరిమస్తుకు చెందిన విషయ సేకరణశాఖ ఈ విషయంలో ఉత్తమ కృషి చేస్తున్నది. వ్యవసాయాభివృద్ధికి సాంకేతిక విధానాల వర్తింపు ఎంత ప్రయోజనకరంగా వుంటేదీ, ప్రదర్శనలద్వారా రుజువు చేస్తున్నది.

నూర్పిళ్లుజరిపిన తర్వాత, కల్లాలలో కనిపించే ధాన్యం రాసులను చిత్రంలో చూడవచ్చు.

భీమవరంలో పశు ప్రదర్శనలో మొదటి బహుమానం సంపాదించిన ఎద్దులజత (శ్రీ కనగాల సర్వరంగారావు పూర్వ కుటుంబం.

భీమవరంలో జరిగిన పశు ప్రదర్శనలో ద్వితీయ బహుమానం పొందిన ఎద్దుల జత— శ్రీ గోకరాజు నరసింహరాజువి.

# హైదరాబాదు కాంగ్రెసు సహకార సమస్యలు

(స్వకీయ విలేఖరి)

హైదరాబాదు, ఏప్రిల్ 12: రాష్ట్ర ప్రభుత్వం, ప్రదేశ కాంగ్రెసుల మధ్య సహకార సమన్వయాలు వృంపిందవలసినంతగా లేవని ప్రదేశ కాంగ్రెసు కార్యవర్గము అభిప్రాయ పడినట్లు తెలుస్తున్నది.

ఈ విషయమై ముఖ్యమంత్రి శ్రీ బూర్గుల రామకృష్ణారావుతో మాట్లాడేందుకు శ్రీయుతులు కె. వి. నరసింగరావు, వ్యవసాయ మంత్రి డాక్టరు మర్రి చెన్నారెడ్డి, శ్రీ వాసుదేవనాయక్‌లను కార్యవర్గం నియమించిందని కూడా తెలుస్తున్నది.

ఢిల్లీలో మే మాసంలో జరిగే ప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుల సమావేశంలో ఈ సమస్యపై చర్చలు జరుగగలవని, అప్పుడు అన్ని విషయాలు విశదం కాగలవని, సభ్యులు అభిప్రాయ పడినారట. కార్యవర్గము సోమవారము నాడు సమావేశమైనది.

తాలూకాలలో తాత్కాలిక సమితులనియామకంవిషయంచర్చకు వచ్చిందట. కొన్ని తాలూకాలలో ఎన్నికలు జరపటానికి కనీసంగా అవసరమైన సభ్యత్వం లేనందు వల్ల తాత్కాలిక సమితులు యేర్పరచవలసివచ్చిందనీ అసమితులలో అన్ని వర్గాలకు ప్రాతినిధ్యం లభించిందీ లేనిదీ విచారించవలసిందని సభ్యులు అధ్యక్షుని కోరినారని తెలుస్తున్నది.

కరీంనగర్ జిల్లా కాంగ్రెసు సమితి కార్యవర్గము విషయమై తనను చేరిన రెండు విభిన్న విజ్ఞాపనలను శ్రీ కె. వి. నరసింగరావు సభ్యులకు చదివి వినిపించారు. జిల్లా కార్యవర్గముపై తమకు విశ్వాసం లేదు. కాబట్టి దానిపై విశ్వాసరాహిత్య తీర్మానం ప్రతిపాదించడానికి తమను అనుమతించమని 37 మంది జిల్లా సమితి సభ్యుల సంతకాలతో ఒకకోక పత్రం చేరిందని, మరోపత్రంలో తమకు కార్యవర్గంపై సంపూర్ణ విశ్వాసం వుందని తెలుపుతూ 37 మంది సంతకాలతో తెలియజేశారని అధ్యక్షుడు చెప్పారు. కొంతమంది సభ్యులు రెండు పత్రాలపైనా సంతకాలు చేశారనీ, సంతకాలసేకరణలో బెదిరింపులు, లాలింపులు జరిగినవనీ ఆక్షేపించడం జరుగుతున్నదని శ్రీ నరసింగరావు అన్నారు. ఈవిషయమై సమగ్ర విచారణ జరపడానికై శ్రీయుతులు వెంకటరామ్‌ప్రసాద్, మహదేవసింగ్ రాంభరోసే, వాసుదేవనాయక్ గార్లతో ఉపసంఘాన్ని కార్యవర్గము నియమించినది. వీరు ఒక మాసంలోగా నివేదిక సమర్పించాలి.

# ఓట్లకోసం 'కొన్ని పనులు' చేయలేని విద్యావంతులు

## ప్రశాంతంగా ఎన్నికలు జరగాలని ముఖ్యమంత్రి హితవు

### పన్నులు గ్రామాలపైనే పడుతున్నాయనడం మూలంగా పట్నాలపైనా వేసినట్లు వివరణ

ఏలూరు, ఏప్రిల్ 12: "మీ పురపాలక సంఘంలో ఒక న్యాయవాది మాత్రమే సభ్యుడుగా ఉన్నారు. ఇదివరలో పురపాలక సంఘాలలో న్యాయవాదులూ, డాక్టర్లు మొదలైన విద్యావంతులు అధికంగా ఎన్నికై పాల్గొంటూ ఉండే వారు. వీరి సంఖ్య అన్ని చోట్లా యీ మధ్యకాలంలో చాలావరకూ తగ్గిపోయింది. ఈ తగ్గుదలకు కారణం గమనించాలి. వారిని ఎందుకు ఈ ఎన్నికలలో పాల్గొనరని అడిగితే, 'మా కెవరు ఓట్లిస్తారు. ఇతర అభ్యర్థులు ఓట్ల నిమిత్తం చేసేపనులు మేం ఎలా చేయగలం' అని అంటున్నారు. ఈ సంఘాలలో కేవలం చదువుకున్నవారే ఉండాలని నా అభిప్రాయంకాదు గాని, వారూ అవసరం" అని ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డి పురపాలక సన్మానానికి సమాధానమిస్తూ అన్నారు.

ముఖ్యమంత్రి నిన్న ఏలూరు పురపాలక సంఘపువారిచ్చిన పౌర సన్మానానికి జవాబిచ్చే సందర్భంలో పైవిధంగా సలహా యిచ్చారు.

సన్మాన సభకు ఏలూరు పౌరులు అత్యధిక సంఖ్యలో హాజరయ్యారు. పురపాలసంఘాధ్యక్షులు శ్రీ దామరాజు వెంకట్రావు సన్మానపత్రాన్ని సమర్పించారు. సన్మానపత్రంలో పురపాలక సంఘాలకు ఇదివరకిస్తున్న టోలు పరిహారం గ్రాంటు రద్దుచేయడంవల్ల రూ 39 వేలు, వినోదాల పన్నులో ప్రభుత్వం హెచ్చు భాగం తీసివేసేందుకు నిర్ణయించినందువలన రూ 12 వేలు మొత్తం 52 వేలు తగ్గిపోగలదనీ, ఈ లోటును భర్తీ చేసుకునేందుకు పురపాలక సంఘానికేదైనా ఉపాయం ప్రభుత్వమే చూపించాలనీ కోరారు. ప్రభుత్వం విధించిన పదతులన్నీ పురపాలక సంఘం అమలు చేసింది కనుక ఈ పట్టణపు మురుగునీటి పారుదల పథకాన్ని వెంటనే మంజూరు చేయవలసిందిగా కోరారు.

మంత్రి సన్మానానికి జవాబిస్తూ రెండు నెలల్లోనే పురపాలక సంఘాలకు తిరిగి ఎన్నికలు జరగనున్నాయనీ, ఆ ఎన్నికలలో ప్రస్తుత సభ్యులందరూ పోటీచేసి, తాము చేసిన సేవ ప్రజలకు వివరించవలసిందనీ, ఎన్నికలు వివిధమైన సంఘర్షణలూ లేకుండా శాంతంగా జరుపుకోవాలనీ అన్నారు.

వినోదపు పన్నులో ప్రభుత్వం హెచ్చు భాగం తీసికొన్నందువల్ల మీకు లోటురాదు. ఈ పన్ను ఆయేటికాయేడు హెచ్చుగా వసూలవుతోంది. కనుక దానివలన వచ్చే సంవత్సరం మీకు కష్టం రాదు టోలు పరిహారం గ్రాంటు వెనుక ఎప్పుడో శ్రీ మునుస్వామి నాయుడు మంత్రివర్గం ఏర్పాటు చేశారు. శాసనసభలో ప్రభుత్వం వేసే పన్నులన్నీ పల్లెటి ప్రజమీదే వేస్తున్నదనీ, బస్తీలవారిపై ఏమీ విధించడంలేదనీ ఆరోపణలు చేయడం మానుతూనే ఉన్నారు. మీమీద ప్రొత్త పన్ను విధించడానికి వీలులేదు కనుక, కనీసం వినోదపు గ్రాంటులు విలుపు చేస్తున్నామని సమాధానం చెప్పుకునేందుకు ప్రభుత్వం ఈ పని తలపెట్టింది. దీనివలన ప్రతి పట్టణానికి వచ్చే నష్టం కొద్దియైనా, మొత్తంమీద ప్రభుత్వానికి మంచి మొత్తమే లభిస్తుంది."

"గత సంవత్సరం రాష్ట్రప్రభుత్వానికి రెవెన్యూ ఖాతాలోనే 5½ కోట్ల లోటు వచ్చిన సంగతి మీకు తెలిసిన విషయమే. అదీకాక ఈ సంవత్సరం, 3 వ ఫారం వరకూ కులమత విచక్షణ లేకుండా అందరు విద్యార్థులకూ ఉచితంగా విద్యగరపేందుకు ప్రభుత్వం నిర్ణయించింది. ఈవిధంగా ఉచిత విద్య యివ్వాలని, మన రాజ్యాంగ చట్టంలో ఉంది. ఈ నిర్ణయం ప్రకటించేముందు దీనికి 15 లక్షలు అవుతుందని అనుకున్నాం. కాని తీరా లెక్కమాచేసరికి 20 లక్షలు దాటవచ్చునని తేలింది. ఇవికాక ఒక్కొక్క పట్టణంలోనూ ఒక పని చేద్దామంటే లక్షల కొలదీ ఖర్చుచేయాల్సి వస్తోంది. అన్ని కారణాలనుబట్టి ప్రభుత్వం ఈ చర్య తీసికోవలసి వచ్చింది. కనుక ప్రజలందరూ, తమ ఖర్చులు తగ్గించుకొని, ప్రభుత్వానికి పన్నులు చెల్లించి, టుణాలిచ్చి సహాయపడాలి" అన్నారు.

ఉపాధ్యక్షులు శ్రీ రాజనాల గోపాలరావునాయుడు వందన సమర్పణ చేశారు.

అనంతరం శ్రీ గోపాలరెడ్డి హిందీ నికేతనాన్ని దర్శించారు. నికేతనాధ్యక్షులు శ్రీ పేర్ల బ్రహ్మయ్య స్వాగతం చెప్పారు. కార్యదర్శి శ్రీ తూము వెంకటేశ్వరరావు స్వాగతపత్రం సమర్పిస్తూ ఈ నికేతనంలో ఉచితంగా హిందీ బోధన జరుగుతోందనీ, 135 మంది విద్యార్థులూ, విద్యార్థినులూ, ప్రాథమిక మొదలు భాషా ప్రవీణ పరీక్షల వరకూ విద్య నభ్యసిస్తున్నారనీ విద్యాలయానికి నెలకు అయ్యే అద్దె రు. 100 శ్రీ కలగర వెంకటరత్నం భరిస్తున్నారనీ, నారమిల్లు యజమానులు శ్రీ బివానీ, వగైరాలు చాలా సహాయం చేస్తున్నారనీ, ఆంధ్ర హిందీ ప్రచారసభ హిందీ అధ్యాపకుని పంపినారనీ తెలిపారు.

ముఖ్యమంత్రి ప్రభుత్వ సహాయం లేకుండా ఈ విశమైన కృషి చేస్తున్న నికేతననిర్వాహకులను అభినందించారు. మన అదృష్టంవల్ల ఆంధ్రదేశంలో హిందీకి ఏమీ వ్యతిరేకత లేదు. పాఠశాలలలో హిందీ నిర్బంధం చేసినా, హిందీ వ్యాప్తికి మరే చర్య తీసికున్నా ఆంధ్ర ప్రజలు సంతోషంతో అంగీకరిస్తున్నారు. ప్రస్తుతం 1, 2, 3 ఫారాలలో వారానికి 2 పీరియడ్లు మాత్రమే బోధిస్తున్న హిందీ బోధన 4 పీరియడ్లకు హెచ్చించవలసిందిగా కోరారు. కాని ఇది ఎక్కువ ఉపయోగకరమే కాక, ఏ నాలుగవ ఫారంలోనో హిందీ ప్రారంభించి, ఎక్కువ పీరియడ్లు బోధనకు ఏర్పాటుచేసి, స్కూలు ఫైనలు తరగతికి వచ్చే సరికి ప్రస్తుత స్థాయికి తగ్గకుండా హిందీ బోధన చేయించడం ఉచితమో మీరు ఆలోచించాలని కోరుతున్నాను. ఈ విషయంలో విద్యాశాఖాధికారుల సలహాలను కూడా తీసుకుంటాము అని అన్నారు.

# గుంటూరుజిల్లా వెనుకపడిన జాతులు

## మహాసభలో శ్రీ లచ్చన్న ప్రసంగం

చీరాల, ఏప్రిల్ 9: గుంటూరు జిల్లా వెనుకబడిన జాతుల మహాసభ మున్న జనాబ్ షేక్ హుస్సేన్‌సాహెబు అధ్యక్షతన జరిగింది. శ్రీ ప్రగడ కోటయ్య జాతీయజండా ఎగురవేశారు. ఆహ్వాన సంఘ అధ్యక్షులు శ్రీ అన్నం ఆదినారాయణ స్వాగతోపన్యాసం చదివారు. శ్రీ గౌతు లచ్చన్న ప్రారంభోపన్యాసమిచ్చారు. తరువాత బహిరంగ సభకు శ్రీ మాదిగాని దేవదత్తు అధ్యక్షత వహించారు. శ్రీ దాసరి పూర్ణచంద్రరావు, శ్రీ ప్రగడ కోటయ్య ఉపన్యసించిన తరువాత శ్రీ లచ్చన్న ఉపన్యసిస్తూ వెనుకబడిన జాతులలో వున్న తర తమ భేధాలు పాగొట్టుకొని అందరు సమాన దృష్టితో వ్యవహరించితే అనతి కాలంలో యావత్తు వెనుకబడిన జాతులూ అభివృద్ధి చెందడానికి అవకాశం వుంటుందని చెప్పారు. ప్రభుత్వం తమ కర్తవ్యం చవలేకుండా భారత రాజ్యాంగ చట్టంలో పొందుపరచిన విధంగా వెనుకబడిన జాతుల అభివృద్ధికి కృషిచేస్తుందని హామీయిచ్చారు. బంజరు భూములు పేదల ఆక్రమణలో వుంటే వారికే ఆ భూములు యివ్వవలసిందని ప్రభుత్వం ఆదేశించిందని చెప్పారు.

తదుపరి వేటపాలెం పట్టణకాంగ్రెస్ యిచ్చిన సన్మాన పత్రానికి సమాధానమిస్తూ త్రాగటం మంచిదని ఎవ్వరూ చెప్పరనీ ఆఖరుకు త్రాగినవాడుకూడా అది మంచిదని చెప్పడనీ అయితే త్రాగుడు దురాచారం మాన్పడానికి ప్రజలలో ప్రచారం ఎక్కువ అవుసరమనీ చెప్పారు. దొంగసారా వ్యాపారం కేవలం ధనవంతులు చేస్తూవున్నారనీ కూలికి పోయిన పేదవాడు జైలుపాలు అవుతున్నాడనీ చెప్పుతూ దొంగసారా వ్యాపారం చేసే ధనవంతులవద్ద శిక్షలువిధించే మేజస్ట్రేటులు మొదలు పై అధికారుల వరకు వెండి గ్లాసులతో కాఫీలు పుచ్చుకునేవారేననీ గ్రామ పెద్దలు దొంగ సారా వ్యాపారస్థులను ప్రోత్సాహపరచకుండా ఉంటే దొంగసారా వ్యాపారం నశించిపోతుందనీ అన్నారు. వృత్తులుపోయిన కల్లుగీత పనివారికోసం నీరా పథకాలు అమలు జరిపి వృత్తులు కల్పించటానికి ప్రయత్నం చేస్తున్నామనీ ఐక్యకాంగ్రెసు ఎన్నికల ప్రణాళికలో పొందుపరచిన విధంగా గీత పనివారికి వృత్తులు కల్పిస్తారనీ హామీ యిచ్చారు.

మధ్యాహ్నం విషయ నిరయసభ శ్రీ దివి కోటేశ్వరరావు అధ్యక్షతన జరిగింది. వెనుకబడిన జాతుల విద్యార్థులకు స్కూల్ ఫైనల్ వరకూ ఉచిత విద్య గరపాలని, స్థానిక సంస్థలలో వెనుకబడిన జాతులకు ప్రత్యేక స్థానాలు కేటాయించాలని, జనాభా నిష్పత్తి ననుసరించి ఉద్యోగాలు ఇవ్వాలనీ, బంజరుభూములు పేదలయిన వెనుకబడిన జాతులవారికి కేటాయించాలనీ, వృత్తులు పోయిన గీతపనివారికి వృత్తులు కల్పించాలనీ తీర్మానాలు చేశారు. తరువాత గుంటూరు జిల్లా వెనుకబడిన జాతుల సంఘానికి అధ్యక్షులుగా శ్రీ అన్నం ఆదినారాయణను, ప్రధాన కార్యదర్శిగా శ్రీ జె. బి. యస్. రావును ఎన్నుకొన్నారు.

# శ్రీ కొమ్మారెడ్డి ఆదర్శం

## దానంగా లభించిన భూమి త్యాగం

ఏలూరు, ఏప్రిల్ 12: లోకసభ సభ్యుడు శ్రీ కొమ్మారెడ్డి సూర్యనారాయణ తనకు రాజకీయ బాధితుడుగా దెందులూరు గ్రామంలో ప్రభుత్వం మంజూరుచేసిన 5 ఎకరాల భూమిని వదలుకోవాలని నిశ్చయించారు. ఆ భూమిని ఎవరైనా మరొక బీదరాజకీయ బాధితునికి యివ్వవలసినదిగా పశ్చిమ గోదావరిజిల్లా కలెక్టరుకు వ్రాశారు. వారి జాబులో యీ క్రింది విషయాలు ఉదహరించారు:

"మీరు సుమారు 10,000 కిమ్మతు చేసే 5 ఎకరాల భూమిని నాకు మంజూరు చేసినందులకు ధన్యవాదాలు. ఇంకా అనేకమంది పేదలైన రాజకీయ బాధితులు ఎలాటి సహాయమూ పొందక ఇంటింటికీ తిరిగే అవస్థలో ఉన్నారు. కాంగ్రెసు రాజకీయ రంగంలో కొంత ప్రముఖస్థానాలలో వున్న నాబోటివారు ఈ సదుపాయం పొందడం సమంజసంగా లేదని నా అభిప్రాయం. ఈ పథకంక్రింద పలుకుబడి గల కాంగ్రెసువారే భూములు పొందగలుగుచున్నారనీ, నిజంగా బాధపడుతోన్న వారికి భూములు లభించడం లేదనీ జనాపవాదం ప్రబలి వున్నది. కనుక నాకు దెందులూరులో యిచ్చిన ఈ 5 ఎకరాల భూమీ మరొక బీదరాజకీయ బాధితునికిమీరివ్వవలసిందిగా కోరుచున్నాను." (స్వ. వి.)

# శ్రీ జానకిరామశర్మ 'రత్నావళి'

## శ్రీ గోపాలరెడ్డికి కృతి

ఏలూరు, ఏప్రిల్ 12: ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డికి స్త్రీల కళాశాలలో ఆంధ్రాధ్యాపకుడుగా పనిచేస్తున్న శ్రీ సామవేదం జానకిరామశర్మ తాము రచించిన 'రత్నావళి' నాటకాన్ని కృతియిచ్చారు.

శ్రీ గోపాలరెడ్డి గౌరవార్థం శ్రీ ఈదర వెంకట్రామయ్య అల్పాహారవిందు చేసి, వెంకట్రామా పవర్ ప్రెస్సును చూపించారు. వారికార్యాలయంలో వేసిన పందిరిలో ఉగాది పండుగజరిపారు. వేదపఠనం పంచాంగ శ్రవణం జరిగినాయి.

తదనంతరం వెంకట్రామా ప్రెస్ తరఫున శ్రీ ఈదర వెంకట్రామయ్య జాతీయ ముద్రణాలయ కార్మికుల తరఫున శ్రీ నోరి రామశర్మ స్వాగత పత్రాలు సమర్పించారు. వేదపఠనం చేసిన పండితులకు మంత్రి కానుకలు బహూకరించారు.

అనంతరం శ్రీ ఆత్మూరి గోవిందాచార్యులు అధ్యక్షతన 'రత్నావళి' నాటకకృతి సమర్పణ జరిగింది. సాహిత్యమండలి అధ్యక్షులు శ్రీ కోరాడ రామారావు స్వాగతం చెప్పారు.

శ్రీ జానకిరామశర్మ నూతనవస్త్రాలతో 'రత్నావళి'ని శ్రీ రెడ్డికి కృతి ఇస్తూ అంకితపద్యాలు చదివారు. శ్రీ గరికపాటి మల్లావధాని ప్రభృతులు కృతికర్త వైదుష్యాన్ని వివరించారు. (స్వ. వి.)

# గిద్దలూరులో వడగళ్ల వాన

## చాలా యిళ్లకు నష్టం

కడప, ఏప్రిల్ 13: గిద్దలూరులో క్రిందటివారంలో విపరీతమైన వడగండ్ల వాన పడింది. వానతోపాటు గాలి కూడా ఎక్కువగా ఉన్నందున చాలా ఇళ్లకు నష్టం కలిగింది. రైలుస్టేషన్ పైకప్పు లేచిపోయింది. బర్మాషెల్ కంపెనీ పెట్రోలు బంకు కూలి 50 గజాల దూరం కొట్టుకొనిపోయింది. తాలూకా కచ్చేరి, ఆసుపత్రి రోడ్లకు యిరుపైపులావున్న చెట్లకొమ్మలు విరిగిపోయినవి.

# గిరిజన ప్రాంతాలలో విద్యా వైద్యం

## శ్రీకాకుళం జిల్లా సంఘ అభ్యర్థన

టెక్కలి, ఏప్రిల్ 10: శ్రీకాకుళంజిల్లాగిరిజన సేవక సంఘం కార్యవర్గ సమావేశం యీ నెల 6 వ శ్రీ. బి. యం. రెడ్డి అధ్యక్షతన జరిగింది.

పాతపట్నము తాలూకాలోని దాసుపురం గిరిజన గ్రామస్థులకు 250 ఎకరాలభూమి మంజూరు చేయించి ఆ గ్రామాన్ని ఆదర్శ గిరిజన గ్రామంగా రూపొందించడానికి అవసరమైన పథకాలను అమలు చేయాలని గిరిజన సంక్షేమ శాఖాధికారిని కోరుతూ తీర్మానించారు. తాలూకాలోని వివిధ గ్రామాలలో విద్యా వైద్య సౌకర్యాలు, కలుగజేయాలని మంచినీటి బావుల త్రవ్వకం, జరిపించాలని అభ్యర్థించారు. అటవీ సంపద రక్షించి, గిరిజనుల పొందుకు ఆర్థికాభ్యున్నతికి కృషి చేసేందుకు ఉత్సాహవంతులైన యువకులతో వనసేన ఏర్పాటుచేయాలని నిశ్చయించారు.

## గంటుల పంచాంగం

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ పంచమి 1956- సం॥ ఏప్రిల్ 15 ఆదివారం ఆ॥ పంచమి 22-28 రోహి 7-8 వర్జ్యం 12-18 ల 13-48 ను.

శు॥ షష్ఠి ఏప్రిల్ 16 సోమవారం షా॥ షష్ఠి 20.15 ఆర్ద్రా రా 4-6 వర్జ్యం 13-28 ల 14-58 ను.

ఆంధ్రపత్రిక

[illegible]
[illegible]
[illegible]
[illegible]
(మహాభారతము)

శ్రీ దుర్ముఖి సం॥ చైత్ర శు॥ పంచమి
ఆదివారం

## రైల్వే సప్తాహం

ఇటీవల దేశంలో సప్తాహోత్సవాల సంఖ్య ఎక్కువైందనే చెప్పాలి. చేనేత వస్త్రాల ప్రోత్సాహానికి దేశవ్యాప్తంగా ఒక సప్తాహోత్సవం; పోలీస్ ఉద్యోగుల సత్ప్రవర్తనాభివృద్ధికి ఇంకొక సప్తాహోత్సవం. ఇలాగే రైల్వే పనివారిది మరో సప్తాహోత్సవం. ప్రస్తుతం రైల్వే పనివారి సప్తాహోత్సవాలు దేశమంతటా జరుగుతున్నవి. ఇవి రేపటితో పూర్తికాబోతున్నవి. మంచిదే. ఇదే విధంగా ప్రతి ప్రజాహిత శాఖలోనూ ఏడాదికొకసారి సప్తాహ మహోత్సవాలు జరుపుకోవచ్చు. వీటివల్ల మొత్తంమీద కొంతవరకైనా ప్రయోజనం వుంటుందనే ఆశించవచ్చు. అయితే, ఈ ఉత్సవాలవల్ల లభ్యమయ్యే ప్రయోజనం కేవలం ఆ ఒక్కవారం రోజులకు మాత్రమే పరిమితమై వుండకూడదు. సంవత్సరంలో ఒకవారం రోజులపాటు ప్రజలపట్ల అత్యంత వినయవిధేయతలతో, స్నేహ సహకారాలతో ప్రవర్తిస్తామనీ, తర్వాత యథాప్రకారమేననీ అనుకుంటే కుదరదు.

దేశం మొత్తంమీద దాదాపు 40 వేల మైళ్ల నిడివిగల రైలుమార్గాలు వున్నవి. దేశం స్వతంత్రమైన తర్వాత భారతీయులకు సంక్రమించిన అమూల్యమైన జాతీయ సంపదలలో మన రైలుమార్గాలు ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తున్నవి. వీటిని సక్రమంగా నిర్వహించవలసిన బాధ్యత రైల్వే సిబ్బందిమీద ఎంత వున్నదో, సవ్యంగా సౌకర్యాలను వినియోగించుకోవలసిన బాధ్యత భారతీయ పౌరులమీద కూడా అంతే వున్నదనే విషయాన్ని మరచిపోకూడదు. అధికారనిర్వహణంలో హద్దుమీరి ప్రవర్తించకూడదనే ప్రాథమికసూత్రం రైల్వే సిబ్బందికి వర్తించినట్లే, ప్రయాణీకులకు కూడా కొన్ని ప్రాథమిక నియమాలు వర్తిస్తవనే విషయాన్ని గుర్తుంచుకోవాలి. అందుచేత అటు ఉద్యోగులు, ఇటు ప్రజలు కూడా బాధ్యత గుర్తెరిగి పరస్పరసహకారంతో మెలగినప్పుడే, ప్రజల సౌకర్యం దృష్ట్యా రైల్వేలను సక్రమంగా నిర్వహించడం సాధ్యపడుతుంది. పరస్పర సహకారాన్ని పెంపొందజేయడమే ఇటీవల ప్రతి ఏడాదీ జరుగుతున్న రైల్వే సప్తాహోత్సవాల ప్రధానోద్దేశం.

ఎక్కడైతే రాజకీయఅశాంతి ఏర్పడినా, దాని ప్రభావం ప్రత్యక్షంగా ఆ ప్రాంతంలోని రైలు మార్గాలమీదా, రైలు బండ్లమీదా కనుపించడం ఇటీవల పరిపాటి అయిపోయింది. ఈమధ్య జరిగిన పూరీ రైలు స్టేషన్ విధ్వంసం ఇందుకు ఒక ఉదాహరణ. ఇవిగాక, రైలు మార్గాలలో, రైలుస్టేషన్లలో, రైలుబండ్లలో జరిగే దొంగతనాల సంగతి, టిక్కెట్లు లేకుండా ప్రయాణంచేసేవారి సంగతి సరేసరి. ఈ అక్రమాలు తొలగిపోయినప్పుడే, రైలుమార్గాలను సక్రమంగా నిర్వహించడం సాధ్యపడుతుంది.

రైల్వే సిబ్బంది వెయ్యి కళ్ళతో కనిపెట్టి వ్యవహరించినప్పటికీ, ఈ దుశ్చర్యలను అరికట్టడం సాధ్యపడదు. ప్రజల, ప్రయాణికుల సంపూర్ణ సహకారం లభ్యమైనప్పుడే, రైల్వే సిబ్బంది ఏదైనా చేయగలుగుతుంది. రైల్వే ఆస్తిని తస్కరించినందువల్లా, ధ్వంసం చేసినందువల్లా నష్టపడేది ప్రజలేననీ, అవాంతరాల వల్ల రైళ్ళు సకాలంలో నడవకపోతే అసౌకర్యాలను అనుభవించేది ప్రజలేననీ అవగాహన చేసుకోడానికి ఈ సప్తాహోత్సవాలు సహాయపడాలి.

ప్రయాణికుల సౌకర్యాల విషయంలో మిగతా దేశాలతో పోల్చి చూస్తే, మన దేశంచాలా వెనుకబడివున్నదనే ప్రవాదం వున్నది. వీటి అభివృద్ధి పట్ల ప్రభుత్వం ఇప్పుడిప్పుడే శ్రద్ధ వహించి పని చేస్తుంది. రైల్వే మంత్రి చేసిన వాగ్దానం ప్రకారం ఇప్పటి మూడవ తరగతి పూర్తిగా రద్దు కావడంతో ఈ సౌకర్యాలకు ఒక స్థిరమైన స్థాయి తప్పక ఏర్పడుతుంది.

రైల్వే ఉద్యోగులు విద్యార్థులు, ఉద్యోగులు అయిన వారిపట్ల ఒకరకంగానూ, నిరక్షరాస్యులైన సాధారణ ప్రయాణికులపట్ల వేరొక విధంగానూ ప్రవర్తిస్తున్నారనే అపవాదు మరొకటి వున్నది. రైళ్లలో ప్రయాణం చేయడానికి విద్యార్థులకు ఎంత హక్కువున్నదో నిరక్షరాస్యులకూ అంతే హక్కు వున్నది కాబట్టి, వీరి పట్ల కూడా సవినయంగా ప్రవర్తించి సహాయపడడం ఉద్యోగుల విధి.

## ఎగువసభ అనవసరం

### స్వామి సీతారాం అభిప్రాయం

వినయాశ్రమం, ఏప్రిల్ 10: ఆంధ్రప్రదేశ్‌కు ఎగువసభ అనవసరమని వృథా డబ్బు ఖర్చు, శాసనాలు రూపొందించటంలో ఆలస్యం, తప్ప మరేమీ లేదని శ్రీ స్వామి సీతారాం తమ అభిప్రాయం తెలియజేశారు. వారి ప్రకటనలో యింకా యిలా పేర్కొన్నారు.

"ఎగువసభ సంప్రదాయం పాతకాలపునాటిది. ఆధునిక ప్రజాస్వామ్య దేశాలలో యీ ఎగువ సభలను రద్దు చేయాలన్న ప్రయత్నాలుకూడా జరుగుతున్నాయి. దీనివలన ప్రయోజనం ఏమీ లేదు. విప్లవాత్మక అభిప్రాయాలను యిది నిరోధించవచ్చు కూడాను. కాంగ్రెసువాదులు యిట్టివాటికి ఎందుకు పట్టుపడుతున్నారో తెలియదు.

దీనిని ఏర్పాటు చేయడమంటే వోటర్లలో విశ్వాసంలేదని అర్థం. అసలు గ్రామరాజ్యం, ఆర్థిక స్వాతంత్ర్యం ప్రతిపాదనలకు బలం చేకూరుతున్న యీ రోజుల్లో యిట్టి సూచనలు సమ్మతం కాజాలవు. గ్రామాలనుంచి పరోక్షంగా శాసనసభలకు ఎన్నికలు జరగాలి. పాశ్చాత్యులనుంచి నేర్చుకొన్న ఎన్నికల విధానమే మనకు శరణ్యం కారాదు. వీటికి పెట్టే వృథా ఖర్చు నిరోధించి ప్రజల ఆహార, వస్త్ర సమస్యలు తీర్చడానికి వినియోగించవచ్చు."

షాంఘై, ఏప్రిల్ 13 : కోమింటాంగ్ ప్రభుత్వ విమానాలు నేటి ఉదయం చైనాలో 5 రాష్ట్రాలమీద కరపత్రాలను పడజల్లినవని కోమింటాంగ్ వార్తా సంస్థ ప్రకటించింది. కమ్యూనిస్టు విమానాలు వీటిమీద దాడిచేసినా, సురక్షితంగా తిరిగి వచ్చినవని ఆ ప్రకటనలో చెప్పబడినది.

నిన్న మధ్యాహ్నపూట ఉత్తరంగా చైనా కోస్తారక్షణ సేనలు ఒక కోమింటాంగ్ విమానాన్ని కూల్చివేసి, మరొకదానిని నాశనం చేసినట్లు పెకింగ్ రేడియో నేటి రాత్రి ప్రకటించింది.

# కాశ్మీరులో యుద్ధవిరమణ రేఖే సరిహద్దు

1 వ పేజీ 3 వ కాలం తరువాయి

పోయాయి. పాకిస్తాన్‌లో ఏ ప్రభుత్వం ఎంతకాలం ఉంటుందో ఎవరూ చెప్పలేకుండా ఉన్నారు. అక్కడ పరిస్థితులు స్థిరంగా లేవు. అందువల్ల పాకిస్తాన్ ఉద్దేశపూర్వకంగా ఏమీ చెయ్యకపోయినా ఎప్పటికే దుష్ట ఘటియలో ఏం జరిగి భారతదేశం ఏ యుద్ధంలో ఇరుక్కోవలసి వస్తుందో భారతదేశం అత్యంత అప్రమత్తంగా ఉండడం మాత్రం అవసరం అని శ్రీ నెహ్రూ అన్నారు.

## పాకిస్తాన్‌కి కూడా ప్రమాదమే

కాశ్మీరు సమస్యకుగల చరిత్రనంతా శ్రీ నెహ్రూ వివరంగా తెలియజేసి, ప్రధానాంశాలను, వాస్తవ స్థితిగతులను ప్రజలు విస్మరించకూడదన్నారు.

కాశ్మీరులో జనవాక్య సేకరణ అనేది సుస్పష్టమైన ఒక షరతుపైన ఆధారపడి ఉందన్నారు. ఆ షరతు ఏమిటంటే, కాశ్మీరు భూభాగంనుంచి పాకిస్తాన్ సైన్యం పూర్తిగా ఒక్కరు మిగలకుండా నిష్క్రమించాలి.

ఈ ముఖ్యమైన షరతుని పాకిస్తాన్ ఈ తొమ్మిదేళ్లుగా అసలు జరపలేకపోయింది. ఈ తొమ్మిదేళ్ళలోనూ కాశ్మీరు స్వరూపమే మారిపోయింది. "కాశ్మీరులో ఇంతకాలంగా సాధించిన సర్వాన్నీ ఇప్పుడొక్కసారిగా తలకిందులు చేసెయ్యాలీ అంటే, అది అత్యంత ప్రమాదకరంగా పరిణమిస్తుంది. అది కాశ్మీరుకీ ప్రమాదమే, భారత దేశానికీ ప్రమాదమే, పాకిస్తాన్‌కీ ప్రమాదమే. స్థిమిత పరిస్థితుల్ని తలకిందులు చెయ్యడం ప్రమాదం ఎందుకంటున్నానంటే, దాని వెనువెంటనే భారత దేశంలోనూ పాకిస్తాన్‌లోనూ కూడా ఘోరాలు జరిగిపోతాయి. 1947 లో ఈ రెండు దేశాలూ చూసి, పడిన ఘోర యాతనలన్నీ తిరిగి సంభవించక మానవు. తిరిగి భారత దేశానికి ఇటూ, పాకిస్తాన్‌కి అటూ ప్రజా వాహిని కరడు కట్టి తరలిపోవలసిన గతి పట్టుతుంది. ఇది కాశ్మీరుకి విధ్వంసప్రాయమై పరిణమిస్తుంది. ఇది మళ్ళీ భారతదేశం, పాకిస్తాన్‌ల మధ్య మరింత వైషమ్యాలకు కారణమౌతుంది.

దీనివల్ల సమస్య పరిష్కారమై ఉభయదేశాల మధ్య సాన్నిహిత్యం ఏర్పడకపోగా, ప్రమాదకరమైన పరిస్థితి సృష్టించినట్లై ఇంకా దూరమైపోతాయి." అని శ్రీ నెహ్రూ అన్నారు.

కాశ్మీరు ప్రజల క్షేమాన్ని కోరుతున్నందువల్ల, భారత పాకిస్తాన్‌ల మధ్య సద్భాంధవ్యం కొనసాగాలని కోరుతున్నందువల్ల, ఈ ఘోరవిపత్తు సంభవించకుండా నివారించడమే భారతదేశం ఉద్దేశ్యం.

ఏడాది క్రిందట పాకిస్తాన్ నాయకులతో తాము జరిపిన సమాలోచనల్ని గుర్తుచేస్తూ శ్రీ నెహ్రూ ఇలా చెప్పారు:

"కాశ్మీరు సమస్యలోని ప్రాథమికాంశాలనుగురించి శ్రద్ధగా యోచించవలసిందని ఏడాదిముందు పాకిస్తాన్ నాయకులకు స్పష్టంగా చెప్పాను. నేను వారితో ఇలా అన్నాను: 'మీ రెంతకాలం నాతో ఈ సమాలోచనలు కొనసాగించదల్చుకోవాలన్నా నాకు ఇష్టమే. మన సమస్యల్ని పరిష్కరించుకుని, మనం కలిసికట్టుగా వ్యవహరించడంకోసం ఏదో మార్గం కనిపెట్టడమే మా ఉద్దేశం. కాని జనవాక్య నిర్ధారణ జరిపేముందు కాశ్మీరు భూభాగంనుంచి మీ సైన్యం నిష్క్రమించాలనే అల్పసమస్యని పరిష్కరించడానికి ఏ శ్రేష్ఠమైనా ప్రయత్నించినా మనం పరిష్కరించలేకపోయినప్పుడు, ఈ సమస్య అంతా పరిష్కారమౌతుందనే ఇంకా మీరు ఆశపడుతున్నారా?' అని అడిగాను."

ఆ తరవాత అనేక కొత్త ఘట్టాలు గడిచాయి. దీనిలో అతి ప్రధానమైనది ఇటీవల అమెరికా పాకిస్తాన్‌కి ఇస్తున్న ఆయుధసహాయం, దీనితో సమస్య స్వరూపమే పూర్తిగా మారిపోయింది. "అమెరికా పాకిస్తాన్‌కి సహాయంగా ఇస్తున్న ఆయుధబలాన్ని భారతదేశంపై ప్రయోగించాలని అమెరికా ఉద్దేశం కాదనే ఒప్పుకుంటాను. కాని ఈ ఆయుధ సహాయంవల్ల భారతదేశంపై దాడి చేసే బలం పాకిస్తాన్‌కి ఎక్కువైంది అనేది నిజం" అని శ్రీ నెహ్రూ అన్నారు.

"కాశ్మీరు సమస్య స్వరూపాన్నే పూర్తిగా ఈ ఆయుధసహాయం మార్చివేసిందని మనం స్పష్టంగా చెప్పాం. ఎందువల్లనంటే, పాకిస్తానీ సైన్యాలు ఇప్పుడు కాశ్మీరు భూభాగం విడిచి వెళ్ళిపోయినప్పటికీ, కాశ్మీరు సరిహద్దుకి ఇరవై ముప్పై మైళ్లలో స్థావరాలేర్పరుచుకొని కూచుంటే చాలు, ఇప్పుడు అదనంగా వచ్చిన ఆయుధ బలం సహాయంతో ఆ దూరంనుంచే దాడి ప్రారంభించగల శక్తి వారికి లభించింది. అందువల్ల ఈ సమస్యని పరిష్కరించడానికి మరో మార్గం కనిపెట్టాలి. ఈ ఆయుధ సహాయం, సైనిక కూటాలతో పరిస్థితులు మరింత క్లిష్టమైపోయాయి." అన్నారు శ్రీ నెహ్రూ.

పాకిస్తాన్ అమెరికా ఇస్తున్న ఆయుధ బల సహాయం, మనీలా, బాగ్దాదు సైనిక కూటాల్లో పాకిస్తాన్ సభ్యత్వం వీటిమూలంగా కాశ్మీరు జనవాక్య నిర్ధారణకు ఆస్కారమే నశించిపోయింది. నేటి పరిస్థితి ఏమిటంటే, కాశ్మీరు భూభాగంనుంచి పాకిస్తాన్ సేనలు ప్రక్కకొలగిపోలేదు; పైగా ఈ కొత్త పరిస్థితులు తలెత్తపడ్డాయి. భారతదేశం ఈ అంశాలన్నిటినీ లెక్కలోకి తీసుకోక తప్పదని శ్రీ నెహ్రూ అన్నారు.

"నేను పాకిస్తాన్ నాయకులతో ఇలా చెప్పాను. 'ఈ సమస్యను పరిష్కరించడమే మా కోరిక. మీ కోరిక అదే. కాని కొత్తగా ఇవి సంభవించాయి. ఇవి కళ్లు మూసుకొని ఊరుకోవలసినవి కావు. కాశ్మీరుకి వినాశకమైనది అక్కడ కల్లోలం తెచ్చిపెట్టేది. ఇతరత్రా కల్లోలాలు తెచ్చిపెట్టేదీ ఏ చర్యనుగాని నేను అంగీకరించడానికి సిద్ధంగా లేను. పాకిస్తాను భారతదేశాలు కలిసికట్టుగా వ్యవహారాలను నిర్వహించుకోవాలనే మన ఆశయం. కాని ఏపాటి కల్లోలం సంభవించినా కలిసికట్టు అసంభవమైపోతుంది. అంతా చూస్తూ ఉంటే, ఈ సమస్యని ఇలాగే ఇంకా ఈడ్చుకుంటూపోవడం వలన ఏం లాభం లేదు. ఈ కొత్త అంశాలను మనం లెక్కలోకి తీసుకొని అప్పుడు పరిష్కారానికి ప్రయత్నించాలి.

"అంటే ఈ సమస్యపైన సమాలోచనలకింక అవకాశం లేదని నేను నిరాకరిస్తున్నానని అర్థంచేసుకోకూడదు. కొత్తపరిణామాలను లెక్కలోకి తీసుకోకుండా తొమ్మిదేళ్ళ నాడు చెయ్యవలసినదే ఈ నాడూ చెయ్యడానికి నన్ను ఒప్పుకోమని అంటే యీ ఒప్పుకోడం నాకు వివేకం కాదు. ఇవంతా పాకిస్తానీ నాయకులకు స్పష్టంగా విడమర్చి చెప్పాను. అవేవీ వారు ఒప్పుకోలేదు." అని శ్రీ నెహ్రూ చెప్పారు.

కాశ్మీరు సమస్యపైన కరాచీలో ఇటీవల మనీలాకూటం చేసిన తీర్మానం ఉచితమైనది కాదని శ్రీ నెహ్రూ అన్నారు. ఆ తీర్మానం చేసినవారు ఆశే దూరం పోకపోయినా, అసలు కాశ్మీరును గురించే అభిప్రాయం ప్రకటించడం తప్పు. కాశ్మీరుపై బహిరంగంగా ఈ కూటం అభిప్రాయం ప్రకటించడం దాకా అనవసరం. అమెరికా బ్రిటన్ వంటి బలీయమైన రాజ్యాలు సంజ్ఞ మాత్రంగానైనా మొగ్గు చూపితే చాలు, పాకిస్తానీ నాయకులకు, పాకిస్తానీ పత్రికలకు ఆ సంజ్ఞ చాలు; ఆ పేక రకాలుగా మాట్లాడగలరు. ఆవిధంగా అభిప్రాయం ప్రకటించినందుకు భారతదేశం నిరసన తెలియచేసింది.

ఈ విషయాన్నీ, మరికొన్ని విషయాలనీ ఇటీవల లోక్ సభలో శ్రీ నెహ్రూ స్పష్టంగా ప్రకటించడానికి కారణం, ఎవరూ ఈ సందర్భంలో ఎలాటి భ్రమలూ పెట్టుకోరాదనే ఉద్దేశమే నన్నారు.

"లోక్ సభలో నా ప్రసంగంవల్ల పాకిస్తాన్‌లో దుమారం రేగింది. నాపైన ఆగ్రహావేశాల ప్రదర్శనం జరిగింది. నేను అబద్ధాలాడుతున్నానని, వాగ్దాన భంగం చేశానని నాపై ఆరోపించారు. అమెరికా బ్రిటన్‌లలో కూడా కొందరు నాయకులు కొన్ని పత్రికలు నాపై ఇదేవిధంగా ఆరోపించి విమర్శలు సాగించారు. కాని వారిలో ఒక్కరికి కూడా కాశ్మీరు సమస్యకి సంబంధించిన యథార్థాలను అర్థం చేసుకోవాలనే శ్రద్ధయినా లేకపోయింది. అందువల్ల ఈ ప్రాథమికాంశాలను ప్రపంచానికి పదే పదే తెలియచెప్పవలసిన అవసరం వచ్చింది.

"నేను లోక్ సభలో వివరించిన యథార్థాలలో ఏది అబద్ధమో నాకు చెప్పమనండి. అంతేకాని, రొమ్ములు బాదుకుని అరిచి గోలచేస్తే యథార్థాలు మాసిపోవు" అని శ్రీ నెహ్రూ అన్నారు.

## తూర్పు బెంగాల్ శరణార్థులు

తూర్పు బెంగాల్‌నుంచి పారిపోయి వస్తున్న వేలాది హిందూ శరణార్థుల వల్ల భారతదేశంపై తగనిభారం పడుతోందని శ్రీ నెహ్రూ అన్నారు. ఇప్పటికి భారతదేశం వచ్చిన శరణార్థుల సంఖ్య 38 లక్షలు. తప్పు విధానాలు అవలంబిస్తే ఎంత ప్రమాద పరిణామాలు సంభవిస్తాయో తెలుసుకోడానికి యీ తార్కాణం చాలన్నారు.

"నా వుద్దేశ్యంలో, తూర్పు బెంగాల్నుంచి భారతదేశం వస్తున్న శరణార్థుల పరారీ, కాశ్మీరు సమస్య పరస్పర సంబంధం ఉన్నవే. పైపైకి యీ రెండు సమస్యలు వేర్వేరుగా కనపడినా, నా ఉద్దేశంలో రెండింటికీ సన్నిహిత సంబంధం వుంది" అని శ్రీ నెహ్రూ అన్నారు.

## భారతీయులు నిగ్రహం చూపాలి

కాశ్మీరు సమస్యపట్ల భారతీయులు ఆందోళన చెందకూడదని శ్రీ నెహ్రూ అన్నారు. "పాకిస్తాన్ చేస్తున్న చర్యల స్థితికి మీరూ నేనూ దిగజారాదని నా అభిప్రాయం. రెచ్చగొట్టే అనుచితమైన అభిప్రాయ ప్రకటనలకు మనం దిగజారి పోకూడదు" అని శ్రీ నెహ్రూ చెప్పారు.

పాకిస్తాన్‌లో ఏం జరుగుతున్నప్పటికీ, భారతీయులు, ముఖ్యంగా ఢిల్లీ నగరవాసులు తమ మాటల్లో నిగ్రహం చూపాలని శ్రీ నెహ్రూ విజ్ఞప్తి చేశారు.

"రెచ్చగొట్టడం, పిడికిళ్లు చూపడం, కత్తులు దుయ్యడం ఇటువంటి వాటికి మన ప్రజలెన్నడూ దిగకూడదు. మనం సభ్యతా మార్గాన్నే అనుసరించాలి. రెచ్చగొట్టడంవల్ల ఏ సమస్యలూ పరిష్కారం కావు" అని శ్రీ నెహ్రూ అన్నారు.

"కాశ్మీరు సమస్యలో మన వాదం బలీయమైనదని మన పత్రికలూ, మన ప్రజలూ గ్రహించాలి. మనం మన వాద బలంపైనే విశ్వాసంతో ఉండాలి కాని పరస్పర దూషణలకు విమర్శలకు లోనుకాకూడదు. ఎంతయినా మనం ఈ సమస్యని పరిష్కరించుకోక తప్పదు. పాకిస్తాన్ ఎల్లకాలం మనకి పొరుగుదేశంగా ఉండక మానదుకదా!" అన్నారు శ్రీ నెహ్రూ.

## పాకిస్తాన్ ప్రజలూ నాయకుల మధ్య అంతరం

మనకి పాకిస్తాన్ ప్రజాసామాన్యంతో తగవేమీ లేదన్నారు శ్రీ నెహ్రూ. "పాకిస్తాన్‌లో ప్రజాసామాన్యానికి విరుద్ధంగా చెప్పవలసిందేమీ లేదు. కొన్ని సమస్యలపట్ల వారొక విధంగా అభిప్రాయపడుతున్నారంటే, తప్పు ప్రజలది కాదు. ప్రతిరోజూ పాకిస్తాన్ పత్రికలు అబద్ధాలూ తప్పులూ ప్రచురిస్తున్నాయి. పాకిస్తాన్ ప్రజలకు నిజాలు తెలియడంలేదు.

"పాకిస్తాన్‌లో సామాన్య ప్రజకూ భారతదేశంలో సామాన్య ప్రజకూ అంతరం ఏమీ లేదనే విషయం మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. ఏ డెనిమిదేళ్ల కిందట మనం అందరం ఒకే దేశానికి చెందిన వాళ్లం.

"ఉన్న చిక్కంతా ఇంకో తరహాకి చెందిన పాకిస్తాన్ నాయకులతోనే ఉంది. అఖండ భారతదేశం స్వాతంత్ర్యంకోసం ప్రజానీకం అంతా సమరం జరిపిన రోజుల్లో, ఈ పాకిస్తానీ నాయకులు విప్లవజీవితం గడిపినవారు కారు. పాకిస్తాన్ ప్రజాసామాన్యం విప్లవంలో పదును తేరింది. కాని ఈ విప్లవంలో పాకిస్తానీ నాయకులు పదును తేరినవారు కారు.

"పాకిస్తానీ నాయకులకు విరుద్ధంగా ఏవో చెప్పాలనికాదు, వారిని విమర్శించాలనికాని నా ఉద్దేశంకాదు. కాని వారినెవ్వరూ విప్లవకారులని మాత్రం అనలేరు" అన్నారు శ్రీ నెహ్రూ.

పాకిస్తాన్ అభ్యుదయాన్నే కోరుతున్నాం అన్నారు శ్రీ నెహ్రూ. కాని ఏ దేశంకాని విదేశీ సైనిక బలంపై ఆధారపడి అభ్యుదయం సాధించలేదు. పాకిస్తానీ నాయకులు ఎంతకీ మరింత విదేశీసహాయం, ముఖ్యంగా ఆయుధ సహాయం పొందాలనే ప్రయత్నిస్తున్నారు. ఈ మాదిరి సహాయం ప్రజాసామాన్యానికి అందుబాటులోకి రాదని, అది వారి అభ్యుదయానికెంతమాత్రం వినియోగపడదనేది వేరే రుజువక్కర లేని నిజం అని శ్రీ నెహ్రూ చెప్పారు.

## హిందూ మతవాదుల చర్యలు దేశానికి ద్రోహం

జమ్మూలో ప్రజాపరిషత్తు చర్యలను శ్రీ నెహ్రూ తీవ్రంగా విమర్శించారు. కాశ్మీరు ఆశయాలకి ఎవరైనా ఎక్కువ అపకారం చేసి ఉన్నారంటే, ఈ ప్రజాపరిషత్తేనని శ్రీ నెహ్రూ అన్నారు. "జనసంఘం నీడలో మత రాజకీయాలు నెరపుతున్న ఈ మత సంస్థ చర్యలు దేశానికి ద్రోహకరం అని స్పష్టంగా నిస్సంకోచంగా చెప్పగలను" అన్నారు శ్రీ నెహ్రూ.

కాశ్మీరు విషయంలో ఈ ప్రజాపరిషత్తు రాజకీయాలకు ప్రధానమైన అర్థం ఉందన్నారు. ముస్లింలీగ్ ప్రచారం చేసిన ద్విజాతి సిద్ధాంతం కాశ్మీరులోనే పెద్ద దెబ్బతిన్నది. భారతదేశం ఈ ద్విజాతి సిద్ధాంతాన్ని ఎన్నడూ ఒప్పుకోలేదు. దేశ విభజనకి ఒప్పుకున్నప్పటికీ, అది ద్విజాతి సిద్ధాంతాన్ని ఒప్పుకోడంమాత్రం కాదు. ప్రజా పరిషత్తు సాగించే మత రాజకీయాలు ఈ ద్విజాతి సిద్ధాంతాన్నే సమర్థిస్తాయి. ప్రజాపరిషత్తు రాజకీయాలవల్ల లబ్ధి పొందినది పాకిస్తాన్ మాత్రమే. ఇటీవల జమ్మూ పురపాలక సంఘ ఎన్నికలలో ఈ పరిషత్తు హింసాపూరిత చర్యలు తమార్గం కానివన్నారు.

"సంకుచిత మత తత్వానికి అతీతంగా మనం నిర్దేశించుకున్న మార్గాన్ని అనుసరించడంలో మనం స్థైర్యం చూపాలి. అది మనకు పరీక్ష, ఆ పరీక్షలో కృతార్థులం కావాలంటే మనం ఎల్లప్పుడూ అప్రమత్తతతో ఉండాలి" అని శ్రీ నెహ్రూ అన్నారు.

## బొంబాయి నగరం

భాషా వివాదాలలో దీర్ఘన్యాయాలు తీసుకురాకూడదని శ్రీ నెహ్రూ అన్నారు:

భాషారాష్ట్ర సమస్యలను శాంతియుతంగా పరిష్కరించుకోవాలి. బొంబాయి నగరం భవిష్యత్తు చివరికి ఏవిధంగా నిర్ణయమైనప్పటికీ, ఆనగరంలోని ప్రజలు పరస్పర సహనం సఖ్యత అలవర్చుకోవడం ప్రధానం అన్నారు. దొమ్మీలు కొట్లాటల ద్వారా రాష్ట్ర పునర్నిర్మాణ సమస్యల్ని పరిష్కరించ యత్నించడం ఏ దృష్టితో చూసినా అనుచితమే అన్నారు. ముందు కర్తవ్యం ఏమిటంటే ఆనగరంలో ఇటీవల కొట్లాటలవలన ఉత్పన్నమైన వైషమ్యాలను నివారించుకోవాలి. వాతావరణంలో పరస్పరానుమానాలు ద్వేషాలు పోవాలి. ఆపైన భారత ప్రభుత్వ నిర్ణయాన్ని చర్చించి మార్చుకోవచ్చును. ప్రభుత్వం చేసిన ఏ నిర్ణయము కాని మార్చరానిది ఏమీ కాదు. తగిన వాతావరణం, పరిస్థితులు ఏర్పడినట్లయితే అవసరాలనుబట్టి మార్పులు చేసుకోడానికి ఎప్పుడూ తావుంటుంది.

## ఆసియా సమస్యలు సైన్యాలవల్ల పరిష్కారం కావు

నిరాయుధీకరణ చర్చల ఫలితంగా ఏదో కొంత ఆయుధాలు తగ్గింపునకు కూడ సూచనలు కనపడుతున్నాయని శ్రీ నెహ్రూ అన్నారు.

బాగ్దాద్ సైనిక కూటంవలన అరబ్ దేశాలమధ్య యుద్ధోద్రేకాలు, వైరాలు ప్రబలాయని శ్రీ నెహ్రూ ఆమూలాగ్రం విమర్శించారు. కొంగా లేని సమస్యలు వేలాది సృష్టించాయన్నారు.

ఈకూటం వలన భద్రత పలుకుతోందనే భావం కలగడానికి బదులు యుద్ధం ఆసన్నమైనదనే భావం కలగడం విచిత్రంగా ఉందన్నారు. కొన్ని దేశాలు, చాలా గొప్పవి పెద్దవి అయిన దేశాలు, యుద్ధబలం అపారంగా పెంచుతున్నాయి.

ఏటంబాంబులు, హైడ్రోజన్ బాంబులు ఇంకా ఘోరమైన అస్త్రాలూ ఉన్నాయి అందువల్ల ఈ దేశాలలో ఎంతకీపూ సైన్యాలబలాలు, యుద్ధాల ధోరణిలో పోతోంది. అంటే సైన్యాలసంగతి అసలు మర్చిపోవాలని నేననడంలేదు. కాని ప్రపంచ సమస్యల్ని సైనికబలాలు పరిష్కరించలేవు. ఇంతకుముందెన్నడూ ప్రపంచ సమస్యల్నీ సైన్యాలు పరిష్కరించ లేదు. ఇప్పుడు అవలే పరిష్కరించ లేవు. మిగతాసమస్యలమాటలా ఉన్నా ఆసియా సమస్యల్ని మాత్రం సైన్యాలు పరిష్కరించలేవని ఖచ్చితంగా చెప్పగలను. కోట్లాది ప్రజలు నివసించే ఆసియా ఖండంలో చెదిరింపులూ సైన్యాలవల్ల ఏ సమస్యలూ పరిష్కారం కాలేవు."

## హైడ్రోజన్ బాంబుల పరిశోధనలు

త్వరలోనే మార్షల్ దీవుల్లో అమెరికా జరపనున్న హైడ్రోజన్ బాంబు ప్రయోగాలు పరిశోధనలగురించి ప్రసంగిస్తూ శ్రీ నెహ్రూ, అటువంటి పరిశోధనలకు భారతదేశం ప్రతికూలమే నన్నారు. అది నిషేధించాలనే భారతదేశం వాదిస్తోంది.

ఏ దేశమైనా బలమైన పారిశ్రామిక ఆర్థిక సంపద పైనే ఆధారపడిఉంటుందని చెప్తూ శ్రీ నెహ్రూ భారతదేశ ఆర్థిక వ్యవస్థ నిర్మాణానికి ప్రజలందరూ సమైక్యభావంతో కృషి చేయాలని బోధించారు.

రెండో ప్రణాళిక అనంతరం భారతదేశం ఇంకా ఎనిమిది ఉక్కు కర్మాగారాలు నెలకొల్పడానికి ప్రయత్నిస్తుందని శ్రీ నెహ్రూ చెప్పారు.

## కాశ్మీరు విభజనకు పాక్ మంత్రి నిరాకరణ

కరాచీ, ఏప్రిల్ 14 : కాశ్మీరు సమస్యను, ప్రస్తుత యుద్ధ విరామ హద్దులే సరిహద్దులుగా విభజించి పరిష్కరించాలనే శ్రీ నెహ్రూ సూచనపై వ్యాఖ్యానిస్తూ పాకిస్తాన్ విదేశాంగ మంత్రి శ్రీ హమీదుల్ హక్ చౌదరి ఆ సూచనను పాకిస్తాన్ అంగీకరించదని పత్రికా విలేఖరులకు చెప్పారు.

"కాశ్మీరు ఆస్తి ఏమీ కాదు పంచుకోడానికి" అన్నారు. "కాశ్మీరు సమస్యలో ప్రధానాంశం ఏమంటే, కాశ్మీరు ప్రజల స్వయం నిర్ణయాధికారం" అన్నారు.

ఏడాది క్రిందట పాక్ నాయకులకు శ్రీ నెహ్రూ చేశారన్న సూచన వివరాలను తెలపాలని కోరగా "నాకు తెలిసినంతవరకు భారతదేశం పాకిస్తాన్‌కి అటువంటి సూచన చెయ్యలేదు" అని జవాబిచ్చారు.

కాశ్మీరు సమస్య పరిష్కారానికి ప్రత్యక్ష రాయబారాల అవకాశాలను గురించి ప్రశ్నించగా "ప్రత్యక్ష రాయబారాలింకెలా జరుగుతాయి? జనవాక్యం ఎలా ఎప్పుడు సేకరించాలనే విషయంపై భారతదేశం మనతో చర్చించడానికి సిద్ధంగా ఉన్నప్పుడే ప్రత్యక్ష రాయబారాలు జరుగుతాయి. కాని జనవాక్య సేకరణే ఇప్పుడు అసంగతం అని శ్రీ నెహ్రూ అంటున్నారు" అని శ్రీ చౌదరి జవాబిచ్చారు.

# తెలుగుదేశ మంతటికీ ఒకే ఒక సాహిత్యసంస్థ

## అవసరమని డాక్టరు బూర్గుల రామకృష్ణరావు విజ్ఞప్తి

హైదరాబాదు, ఏప్రిల్ 12 : తెలుగుభాష మాట్లాడే వారున్న ప్రాంతమంతటికీ ఒకేఒక సాహిత్యసంస్థ అవసరమని తెలుగు సంస్కృతీసంఘం అధ్వర్యాన ఉగాది ఉత్సవాల సందర్భంలో సాహిత్యగోష్ఠికి ప్రారంభోత్సవం చేస్తూ ముఖ్యమంత్రి డాక్టరు బూర్గుల రామకృష్ణరావు అన్నారు.

సభకు హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ జె. వి. నరసింగరావు అధ్యక్షత వహించారు.

డాక్టరు రామకృష్ణరావు ప్రసంగిస్తూ ఇట్లా అన్నారు: "ఆంధ్రులకు ఈ ఉగాది చాలా విశిష్టమైనది. ఈ యేడాదిలో హైదరాబాదు నగరం రాజధానిగాగల ఒక పెద్ద రాష్ట్రంలో ఆంధ్రులందరూ కలిసిపోతారు. ఒక ప్రాంతంలోని ప్రజల ఔన్నత్యం రాజకీయ సంక్షేమాది కార్యక్రమాలలో పేకాక సాంస్కృతిక వారసత్వం, వైజ్ఞానిక కార్యకలాపాలలోకూడా కనిపించుతుంది. సంస్కృతిలో సాహిత్యం ప్రధానమైనది. సర్వకాలాలలోను సాహిత్యానికి చాలా ప్రాముఖ్యం ఉన్నది. ఆంధ్రులకు గొప్ప సాహిత్య సంప్రదాయం ఉన్నది. ఆయా రోజుల ఔన్నత్యం లేదా తదితరం అద్దంలోలా సాహిత్యంలో ప్రతిబింబించుతుంది."

"ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాల్లో యీనాడు అనేక సంస్థలు మతకు లోచినట్లు విడివిడిగా సాహిత్యసేవ చేస్తున్నవి. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ప్రారంభమైన నవజీవనోద్యమాన్ని ప్రతిబింబించే కొంగ్రొత్త రచనలను ప్రోత్సహించేందుకు వీలుగా, ముఖ్య కేంద్రాలలో శాఖలతో పటిష్టమైన ఏకైక తెలుగు సాహిత్యపరిషత్తును, ఇప్పటి సంస్థలన్నింటిని సమన్వయించేప ఈ రెండు ప్రాంతాలు కలిసిపోయిన తరువాత ఏర్పాటు చేయవలసిఉన్నది."

"ఈ అభిప్రాయాన్ని ప్రజలలో ప్రచారం చేసి పటిష్టమైన ఏకైక తెలుగు సాహిత్య పరిషత్తును నెలకొల్పడానికి అనుకూల వాతావరణం ప్రజలలో నెలకొల్పేందుకు కృషి చేయాలని తెలుగు సంస్కృతీసంఘం తీర్మానించడం ప్రశంసనీయం."

సంస్కృతీ సంఘం అధ్వర్యాన నాట్యగోష్ఠికి ప్రారంభోత్సవం చేస్తూ ఆధునిక సౌకర్యాలన్నింటితో హైదరాబాద్ నగరంలో నాటక ప్రదర్శన మందిర మొకటి నిర్మించవలసిన అవసరాన్ని వ్యవసాయశాఖ మంత్రి డా॥ ఎమ్. చెన్నారెడ్డి వివరించారు. ఆంధ్రుల నాటక కళా కౌశలాన్ని ప్రస్తావించి డాక్టరు చెన్నారెడ్డి ఇట్లా అన్నారు: "నాటక రంగమంటే ప్రజలకుగల అభిరుచికి తగ్గట్టుగా ఆంధ్ర తెలంగాణా ప్రాంతాల్లో నాటక ప్రదర్శన సౌకర్యాలు లేవు. ఆధునిక సౌకర్యాలన్నింటితో నాటక ప్రదర్శన మందిర మొకటి నిర్మించేందుకు ఆంధ్రలో లోగడ కొంత కృషి జరిగింది. కాని, చెప్పుకో తగ్గ ఫలితం రాలేదు".

"హైదరాబాద్ నగరంలో వీధి నాటక రంగస్థలం, మామూలు నాటక ప్రదర్శన మందిరాన్ని నిర్మించే విషయం పరిశీలించడానికి నేను అధ్యక్షుడుగా సంగీత నృత్య నాటక పరిషత్తు ఒక సంఘాన్ని నియమించాను. ఏదో కొంత పని జరిగింది. ఇందుకొక స్థలాన్ని అఖిలభారత పారిశ్రామిక వస్తు ప్రదర్శన సంఘం చూపించారు. ఇంకా కొన్ని స్థలాలు కూడా ఆలోచనలో వున్నవి. ఈ సంఘానికి కొంత డబ్బుకూడా ఉన్నది."

"జాతీయ నాటక ప్రదర్శన మందిరాలను నిర్మించేందుకు ఢిల్లీ, బొంబాయిలలో ప్రయత్నాలు జరుగుతున్నవి. హైదరాబాద్ కూడా ప్రధాన నగరమే. అందువల్ల ఆధునిక సౌకర్యాలన్నీ ఉన్న నాటక ప్రదర్శన మందిర మొకటి హైదరాబాద్‌కు కూడా అవసరమే. ఇదేమంత చిన్న పని కాదు. కనీసం ఆరు లక్షలయినా కావాలి. ప్రభుత్వము, పురపాలక సంఘములు తదితర ప్రజా సంఘములు సమైక్యమై సమగ్రమయిన కార్యక్రమ మొకటి తయారు చెయ్యాలి. ఈ రెండు ప్రాంతాలూ కలసి విశాలాంధ్ర ఏర్పడే టప్పటికల్లా యీ కార్యక్రమం తయారై సిద్ధంగా ఉంటే కొత్త ప్రభుత్వం వెంటనే పని ప్రారంభించే అవకాశం ఉంటుంది."

ఒకే ఒక తెలుగు సాహిత్య పరిషత్తును నెలకొల్పవలసిన అవసరాన్ని ప్రజలలో ప్రచారంచేసి 'అనుగుణ వాతావరణం నెలకొల్పాలని, హైదరాబాద్ నగరంలో ఆధునిక సౌకర్యాలతో నాటక ప్రదర్శన మందిర నిర్మాణానికి కృషి చెయ్యాలని తెలుగు సంస్కృతీ సంఘం నూతన సంవత్సర తీర్మానం చేసిందని కార్యదర్శి శ్రీ కె. కాశీపతి వివరించారు.

ఉగాది తీర్మానం కార్యరూపం దాల్చుతుందని, ఈ ఆశయాలను నెరవేర్చడానికి తెలుగు సంస్కృతీ సంఘం అవిరళకృషి చేస్తుందని ఆశిస్తున్నారని శ్రీ జె. వి. నరసింగరావు చెప్పారు.

## ఆశయాల వివరణ

సారస్వత పరిషత్తు ఆశయాలు వివరిస్తూ శ్రీ కపిల కాశీపతి సభవారికి ఈ క్రింది నివేదిక చదివి వినిపించినారు.

మన రాజ్యాంగంలో పేర్కొన్న ప్రాంతీయ భాషలలో జనసంఖ్యనుబట్టి తెలుగు ప్రథమస్థానం అలంకరిస్తున్నది. సాహిత్య వికాసంలోకూడా బెంగాలీ వంటి భాషలతో సరితూగగలదు. బెంగాలీ, మహారాష్ట్రం, కన్నడం మున్నగు భాషలకు ఏక సాహిత్య పరిషత్తు లేర్పడి, భారత సాహిత్య ఎకాడమీతో, ఇతరభాషా పరిషత్తులతో, ప్రాంతీయ విశ్వవిద్యాలయములతో, ప్రభుత్వములతో ప్రాతినిధ్య ప్రతిపత్తితో సాహిత్యాది విషయములందు వ్యవహరిస్తున్నవి.

తెలుగు మాటలాడేవారందరికీ ప్రాతినిధ్యం వహించే పరిషత్తొకటి లేకపోవుట విచారకరం. ఆంధ్ర సాహిత్యపరిషత్తు, సాహితీ సమితి, నవ్యసాహిత్య పరిషత్తు, ఆంధ్ర సారస్వత పరిషత్తు, తెలుగు భాషా సమితి, తెలంగాణా రచయితలసంఘం, రాయలసీమ సాహిత్య పరిషత్తు, అభ్యుదయ రచయితల సంఘం వంటి సంస్థలెన్నో ఒక్కొక్క ప్రయోజనం కోసం ఏర్పడి యథాశక్తి సాహిత్యారాధన చేస్తున్నవి. వీనిలో నేడియు ఇతర ప్రాంతీయ సాహిత్య పరిషత్తులవలె యావదాంధ్ర ప్రజకు ప్రాతినిధ్యం వహించలేక పోతున్నవి. అందువల్ల మన భాషకు సాటి భాషలలో రావలసిన గౌరవం లభించకుండా పోతున్నది. కాబట్టి తెలుగు భాషకు ఏక ప్రతినిధియైన పరిషత్తును నిర్మించుకోవాలి. ఆ పరిషత్తు:

1. భారత సాహిత్య ఎకాడమీ తెలుగుభాషా వ్యవహారాలను గూర్చి సలహాలిచ్చేదిగా ఉండవలెను.
2. ప్రదేశ ప్రభుత్వాలతో, విశ్వవిద్యాలయాలతో తెలుగు భాషా విషయాలను గూర్చి అధికారంతో చర్చించేదిగా ఉండవలెను.
3. తెలుగు రచయితల నాదరిస్తూ, రచయితకు పఠితకు అనుబంధం గూర్చే సహకార సూత్రము నవలంబించి గ్రంథ ప్రచురణ సాగిస్తూ, గ్రంథరచనను బలపడు తెరువయేటట్లు సమర్థించవలెను.
4. ఇతర ప్రాంతములలో తెలుగు సాహిత్య ప్రచారమును మన ప్రాంతాన ఇతర సాహిత్య ప్రచారమునూ చేయవలెను.

ఈ ఆశయ సిద్ధి కోసం తెలుగు దేశంలో వివిధ సాహిత్య సంస్థల, ప్రసిద్ధ రచయితల, ప్రాంతీయ ప్రభుత్వముల, విశ్వ విద్యాలయముల సహకారము సంపాదించవలెను.

శ్రీయుతులు దాశరథి, కె. లక్ష్మణ శాస్త్రి గారలు కవితాగానం చేశారు. నూతన పంచాంగ నిర్ణాయక సంఘం సూచనల ప్రకారం శ్రీ వి. మాధవ శర్మ తయారుచేసిన పంచాంగశ్రవణం జరిగింది.

# సరిహద్దుల గ్రామీణులు హెచ్చరికగా ఉండాలి

## రక్షణమంత్రి కట్జూ హెచ్చరిక

జోధ్‌పూర్, ఏప్రిల్ 14 : పాకిస్తాన్ భారతదేశం సరిహద్దుల్లో ఉండే గ్రామాల ప్రజలు ఎప్పుడేది సంభవించినా అందుకు సిద్ధంగా ఉండాలని భారతదేశ రక్షణ మంత్రి డా॥ కట్జూ హెచ్చరించారు.

సరిహద్దు సమీపంలో తిల్వారా పశువుల సంతలో ఉత్తమ పశువులకు బహుమతులిచ్చే సందర్భంలో అక్కడి గ్రామీణుల సభలో ప్రసంగిస్తూ శ్రీ కట్జూ పై హెచ్చరిక చేశారు.

ఇటీవల, సరిహద్దు సంఘర్షణల వలన ప్రభుత్వం జాగ్రత్త వహించిందని చెప్తూ అవసరానికి సిద్ధంగా ఉండే ప్రజలుకూడా ప్రభుత్వానికి తోడ్పడాలని శ్రీ కట్జూ అన్నారు.

## బుద్ధజయంతికి లామాలు రాలేరట

న్యూఢిల్లీ, ఏప్రిల్ 14 : టిబెట్ బౌద్ధ జగద్గురువులు శ్రీ పంచెన్ లామా శ్రీ దలైలామా వచ్చే మేనెలలో జరిగే బుద్ధజయంతి 2500వ శతాబ్దోత్సవానికి హాజరయే చాలా పనులు ఉన్నవనీ భారత ప్రభుత్వం పంపిన ఆహ్వానానికి చైనా ప్రభుత్వం జవాబిచ్చింది. అని ప్రధాని నెహ్రూ నేడు లోక్‌సభలో వెల్లడించారు. అయితే చైనా బౌద్ధ సంఘం తరపున ప్రముఖ బౌద్ధ నాయకులు కొందరు ఉత్సవాలకువస్తారట.

## కృష్ణమీనన్ రాక

బొంబాయి, ఏప్రిల్ 14: కేంద్ర ప్రభుత్వ మంత్రి శ్రీ వి. కె. కృష్ణమీనన్, లండనునుండి విమానంలో యిక్కడికి వచ్చారు. రేపు ఢిల్లీ వెడతారు.

